సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAC

సంపుటము 46
సంచిక 5
7-10-53

విజయ భాద్రపద బహుళ అమావాస్య బుధవారం

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభోత్సవం

అక్టోబరు 1 వ తేదీన రాష్ట్ర ప్రారంభోత్సవంతో ఆంధ్రజాతి చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభమైంది. గవర్నరుగా శ్రీ త్రివేదీ ప్రమాణం తీసుకుని ప్రథమాంధ్ర మంత్రిమండలిచేత ప్రమాణం చేయించారు. ముఖ్యమంత్రినీ, తదితర మంత్రులనూ నియమిస్తున్నట్లు గవర్నరు మొట్టమొదటి ఆంధ్రా గెజెట్ జారీచేసి ప్రకటించారు. త్వరలోనే మరిద్దరు మంత్రులను నియమించగలరని కూడా గెజెట్‌లో ప్రకటించబడింది. ఆంధ్ర రాష్ట్రానికి ప్రారంభోత్సవం జరుపుతూ భారత ప్రధాని పండిట్ నెహ్రూ ఆంధ్రుల ప్రతిభనూ, ఉత్సాహ శక్తులనూ కొనియాడుతూ వీనిని సద్వినియోగం చేస్తే బ్రహ్మాండమైన జాతీయ నిర్మాణశక్తి ఉద్భవిస్తుందని చెప్పారు. "మీరు ఆంధ్ర దేశాన్ని అభివృద్ధి పరిస్తే భారత దేశాన్ని అభివృద్ధి పరిచినట్లే" అని పండిట్ నెహ్రూ చెప్పారు. (పండిట్ నెహ్రూ ఉపన్యాసం పూర్తిపాఠం 2 వ పేజీలో ముద్రించబడింది.)

ప్రారంభోత్సవంలో పాల్గొనడానికి

(53 వ పేజీ చూడండి)



ఇద్దరు తెలుగు ముఖ్యమంత్రులు. టంగుటూరి ప్రకాశం, బూర్గుల రామకృష్ణారావుగార్లు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : ఫిల్మిస్తాన్ వారి "షర్త్"లో శ్యామ

ఆంధ్రరాష్ట్ర ప్రారంభోత్సవం 1
ఆంధ్రులకు పండిట్ నెహ్రూ ఆదేశం 2
ప్రథమాంధ్ర మంత్రి మండలి 3
కాలక్షేపం-దాసు వామనరావు 5
నల్లమేక — రాచకొండ విశ్వనాథ శాస్త్రి 6
అంతులేని రాజమార్గం — కవికొండల వెంకటరావు 8
రాంగ్ రూట్ బుష్‌కోటు — అవసరాల రామకృష్ణారావు 10
సేవింపు ఎకౌంట్లు — ఓగేటి శివరామకృష్ణ 12
అడ్డుతగిలే స్వేచ్ఛ-బొమ్మిరెడ్డి 28
పరోక్షము-సమక్షము — ఇల్లిందల సరస్వతీదేవి 23
విజ్ఞాన వీథులు — "డాక్టర్" 25
మతద్వేషం — వల్లభ సేని 27
సంధి-విగ్రహం — విశ్వాత్ముల నరసింహమూర్తి 28
ముచ్చటగా ముగ్గురు — జెరోమ్ కె. జెరోమ్ 30
చిరకాల నిద్రితుడు — వాషింగ్టన్ ఇర్వింగ్ 34
సినిమా 44
ప్రశ్నలు-సమాధానాలు 4

# ఆంధ్రులకు పండిట్ నెహ్రూ ఆదేశం

[ఆంధ్రరాష్ట్ర ప్రారంభోత్సవంలో నెహ్రూ ఉపన్యాసపాఠం]



ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ

"చాలాకాలంనుంచి మీరు కంటున్న కలలు ఇవాళ నిజమైనాయి. యీరోజు చాలా శుభదినం. అందరికీ సంతోషదాయకమైనది. మీ రాజ్యపాలకుడు త్రివేదిగారిచే ప్రధాన న్యాయమూర్తి ఈ ఉదయమే ప్రమాణ స్వీకరణ జరిపించారు. ఆంధ్ర రాష్ట్రంలో కొత్తప్రభుత్వం ఏర్పడబోతోంది. కొత్త మంత్రివర్గం ఈ ఉదయమే ఏర్పడింది. ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఈ ఉదయమే ప్రమాణ స్వీకారం చేశారు. శ్రీ సంజీవరెడ్డిగారిని ఉప ముఖ్యమంత్రిగా నియమించారు. ఇంతవరకు మంత్రివర్గ నిర్ణయం ఇంకా పూర్తి కాలేదు. ఇంకా యిద్దరు మంత్రులు రెండు మూడు రోజుల్లో నియమింపబడతారు."

## భారత రాజ్యాంగం-ఆంధ్రరాష్ట్రం

"మనము ఒక రాజ్యాంగాన్ని నియమించుకొన్నాము. ఆ రాజ్యాంగం క్రింద ఆంధ్రరాష్ట్రము ఏర్పడింది. ఆంధ్రరాష్ట్రము కోసము కృషిచేసి దానిని స్థాపించుకొంటున్నందుకు మిమ్మల్ని నేను అభినందిస్తున్నాను."

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ గవర్నరు, మంత్రుల ప్రమాణస్వీకారం ఒక చిన్న గదిలో జరిగింది. ఈ విశాల అవకాశం క్రింద, లక్షలాది జనసమూహంముందర ఆ ప్రమాణాన్ని మళ్ళీ మంత్రులేగాక, ప్రజలందరూగూడా తీసుకోవాలని నేను కోరుతున్నాను.

## ఆంధ్రుల చరిత్ర - ప్రస్తుత స్థితి

"ఆంధ్రుల చరిత్ర చాలా పురాతనమైనది. ఆంధ్రరాష్ట్రము ఇప్పుడేర్పడుతున్నా కూడా, ఆంధ్రులకు గొప్ప చరిత్ర, సంప్రదాయము సంస్కృతి ఉన్నది కనుక నేను ఢిల్లీలో ఉన్నా, మీరు ఇక్కడ వున్నా మనం అందరమూ భారతీయులము. ఆంధ్రదేశములో మీకు ఎంత హక్కున్నదో నాకూ అంత హక్కు ఉన్నది. తక్కిన రాష్ట్రాల్లో ఆంధ్రులకు సమాన హక్కు ఉన్నది. హిమగిరి శిఖరంనుంచి కన్యాకుమారి వరకు గూడా ఈ దేశమంతా మన అందరి వారసత్వమూను. ఈ దేశంలో భాషావిషయకంగాను, మత, సాంఘిక విషయంగాను, ఎన్ని విభేదాలు ఉన్నా భారతదేశమంతా ప్రాతిపదికంగా ఒక్కటే."

"మీరు భారతదేశాన్ని వదిలి విదేశాలకు వెడితే 'నేను భారతీయుణ్ణి' అని చెప్పుకుంటే వారికి తెలుస్తుంది. గాని నేను ఆంధ్రుణ్ణి, బొంబైవాణ్ణి అని చెప్పుకుంటే తెలియదు. భారతదేశంలో అనేక రాష్ట్రాలు ఉన్నట్టులే అనేక మతాలు, కులాలు కూడా ఉన్నాయి. కాని ఏ మతానికి చెందినవారైనా మనమంతా భారతీయులం, అందరమూ ఒక తల్లిబిడ్డలమే. అందరమూ సమాన హక్కు గలవారమే. అంతేకాని, ఒక ప్రత్యేక మతానికి చెందామన్నంత మాత్రాన అధికుల మనుకొనడం భ్రమ. మనమీ జాతి మత విభేదాలు వదిలిపెట్టకపోతే ఇవి మన బలహీనతకు దారి తీయగలవు. ఈ విభేదాలు అంతరిస్తేనేగాని దేశము ముందుకుపోదు."

"భారతదేశము అనే ఒక గృహములో ఆంధ్రదేశం అనేది ఒక గది. భారతదేశాన్ని వృద్ధిచేస్తేనే ఆంధ్రరాష్ట్రము వృద్ధి అవు

(52-వ పేజీ చూడుడు)

# ★ ప్రథమాంధ్ర మంత్రి మండలి ★

## శ్రీ టి. ప్రకాశం పంతులు

గుంటూరు జిల్లాలో 1873 లో జన్మించారు. చిన్నతనం నుంచీ పేదరికంవల్ల వచ్చిన కష్టాలను ఎదుర్కొని పట్టుదలతో ప్రతిభతో రాజమహేంద్రవరంలో విద్యాభ్యాసం చేశారు. న్యాయశాస్త్రం అభ్యసించి రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు పెట్టి తరువాత ఇంగ్లండు వెళ్ళి బారిష్టరు పట్టాన్ని పొందారు. మదరాసు హైకోర్టులో అడ్వొకేటుగా లక్షలాది ఆర్జిస్తూ గాంధీజీ పిలుపు ననుసరించి ప్రాక్టీసు వదిలిపెట్టి సహాయనిరాకరణోద్యమంలో చేరారు. సైమన్ కమిషను వచ్చినప్పుడు బ్రిటిష్ ఫిరంగులకు వెరవక రొమ్ముచూపించి అసమ్మతి ప్రదర్శనంలో పాల్గొని 'ఆంధ్ర కేసరి' అనే బిరుదును పొందారు. ప్రతి కాంగ్రెసు వుద్యమంలోను జైలుకు వెళ్లారు. చాలకాలం ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులుగా వున్నారు. ముప్ఫయ్యేళ్లపైగా అఖిలభారత కాంగ్రెసు సభ్యులుగా వున్నారు. స్వరాజ్య అనే ఆంగ్ల పత్రికను కొన్నాళ్ళు నిర్వహించారు. 1926-30 కేంద్ర శాసన సభా సభ్యులుగా ఉన్నారు. 1936 లో మదరాసు నుంచి మదరాసు అసెంబ్లీకి ఎన్నికై రాజాజీ మంత్రివర్గంలో రెవెన్యూమంత్రి అయ్యారు. జమీందారీ రద్దు బిల్లు ప్రవేశపెట్టారు. 1946-47 లో 11 మాసాలు మద్రాసు రాష్ట్ర ప్రధాన మంత్రిగా పనిచేశారు. 1950 లో కాంగ్రెసుతో భిన్నాభిప్రాయ మేర్పడి వీరు, రంగాగారు వేరేపార్టీ పెట్టారు. ఎన్నికల నాటికి ఎవరి పార్టీవారు స్థాపించుకున్నారు: గత ఎన్నికల తర్వాత వివిధ ప్రతిపక్షాలను కలిపి యు. డి. ఎఫ్. ను ఏర్పాటుచేసి కొంతకాలం అందులో ఉండి తర్వాత దానితో తెగతెంపులు చేసుకున్నారు.

1952 నుంచి కొంతకాలం మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా ఉన్నారు. శృంగవరపు కోటనుంచి ప్రజాసోషలిస్టు అభ్యర్థిగా పోటీలేకుండా మద్రాసు శాసనసభకు 1953 ఏప్రిల్ లో ఎన్నికైనారు. కాంగ్రెసు - ప్రజాసోషలిస్టు పక్షాలు కలిసి ప్రభుత్వాన్ని నిర్మించడానికి ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షునితో కలసి కనీస కార్యక్రమ ప్రణాళికపై ఒప్పందానికి వచ్చారు. వీరి అధ్యక్షతన ఆంధ్రశాసన సభ్యులు సమావేశమై కర్నూలును తాత్కాలిక రాజధానిగా నిర్ణయించారు.

ప్రజాసోషలిస్టుపక్షంలోని అన్ని హోదాలతోను తమసంబంధాన్ని వదిలిపెట్టి 26వ తేదీన మద్రాసు శాసనసభ కాంగ్రెసు పక్షంలో సహ సభ్యులుగా చేరారు.



మంత్రి

## శ్రీ నీలం సంజీవ రెడ్డి

అనంతపురంజిల్లా ఇల్లూరు గ్రామంలో సంపన్న రైతుకుటుంబంలో 1913 మే 13వ తేదీన జన్మించారు. అనంతపురం ఆర్ట్సు కాలేజిలో ఉన్నత విద్య నభ్యసించారు. విద్యార్థిగా ఉండగానే కాంగ్రెసు ఉద్యమంలో చేరారు. 1938 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంయుక్త కార్యదర్శిగా ఎన్నికై 1946 వరకు ఆపదవిలోనే ఉన్నారు. 1946 లో మద్రాసు అసెంబ్లీకి అనంతపురంనుంచి శాసనసభ్యుడుగా ఎన్నికైనారు. 1947 లో రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుసభ్యులుగా ఎన్నికైనారు. కుమారస్వామిరాజాగారి మంత్రివర్గంలో మద్యనిషేధమంత్రిగా పనిచేశారు. మంత్రిపదవి నుంచి రాజీనామానిచ్చి 1950 ఏప్రిల్ లో ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికైనారు. ఇప్పటివరకు ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులుగానే ఉన్నారు. అఖిలభారత కాంగ్రెసు కార్య సంఘ సభ్యులుగాను, పార్లమెంటరీబోర్డు సభ్యులుగాను నియమింపబడ్డారు. తర్వాత కౌన్సిల్ ఆఫ్ స్టేటు సభ్యులుగా ఎన్నికైనారు. కాళహస్తి నియోజక వర్గంనుంచి బలరామరెడ్డిగారు రాజీనామా ఇచ్చిన స్థానానికి మదరాసు అసెంబ్లీకి ఎన్నికైనారు.



మంత్రి

## శ్రీ కడప కోటిరెడ్డి

"కడపజిల్లాలో 1887 అక్టోబరులో జన్మించారు. బారిస్టర్ గా 1914 నుంచి 1918 వరకు కడపలో ప్రాక్టీసు చేశారు. 1926-30 లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్లో స్వరాజ్యపార్టీ డెప్యూటీ లీడరుగా పని చేశారు. 1935 లో రాయలసీమ క్షామ నివారణ సంఘాధ్యక్షులుగా నియమింపబడ్డారు. ఆంధ్రమహాసభ అధ్యక్షులుగా వుండినారు. 1923 నుంచి ఎం. ఎల్. సి. గా ఉండినారు. 1936 లో మద్రాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నికైనారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షులుగాను, మద్రాసు శాసనసభల కాంగ్రెసుపక్ష ఉపనాయకులుగానూ చాలాకాలం ఉన్నారు. 1946 లో కడప నియోజకవర్గంనుంచి మద్రాసు అసెంబ్లీకి ఎన్నికై ప్రకాశంగారి మంత్రివర్గంలో మద్యనిషేధ మంత్రిగాను, దేవాదాయశాఖ మంత్రిగాను పనిచేశారు. గత జనరల్ ఎన్నికల్లో మళ్లీ కడప నియోజకవర్గంనుంచి మద్రాసు అసెంబ్లీకి సభ్యుడుగా ఎన్నికైనారు. శాసనసభ్యునిగా ఇంతకాలం పని చేసిన గౌరవం వీరికే దక్కినందున మద్రాసు అసెంబ్లీ స్పీకరు "శాసనసభా జనకులు" అని గౌరవించారు.

# ★ ప్రథమాంధ్ర మంత్రిమండలి ★



మంత్రి

## శ్రీ తెన్నేటి విశ్వనాధం

విశాఖపట్నం జిల్లాలో 1896 లో సంపన్న కుటుంబంలో జన్మించారు. విశాఖపట్నంలో న్యాయవాదిగా కొంతకాలం ప్రాక్టీసుచేసి తరువాత సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. చిరకాలం అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులుగాను, విశాఖపట్నం జిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగాను ఉన్నారు. 1937 లో మదరాసుఅసెంబ్లీకి విశాఖపట్నం నియోజకవర్గంనుంచి సభ్యుడుగా ఎన్నికైనారు. 1937-39 రాజాజీ మంత్రివర్గంలో రెవిన్యూ మంత్రి ప్రకాశంగారికి పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు. పలుమార్లు కారాగారవాసం చేశారు. 1946 లో విశాఖపట్నంనుంచి మదరాసు శాసనసభకు ఎన్నికై ప్రకాశంగారు ప్రధాన మంత్రి అయినప్పుడు వారివద్ద చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శిగా వ్యవహరించారు.

1947 లో విశాఖపట్నం మున్సిపల్ ఛెయిర్మన్‌గా ఎన్నికై వారు ఛెయిర్మన్‌గా ఉన్న కాలం విశాఖపట్నం అనేకవిధాల అందమయిన పట్నంగా చేయడానికి నీటి సరఫరారోడ్లు, విద్యుచ్ఛక్తివ్యాప్తికి ఎంతో కృషిచేశారు. కాంగ్రెసులో విభేదాలు ఏర్పడి ప్రకాశంగారితోబాటు వీరు బయటకువచ్చేశాక, కాంగ్రెసుపక్ష అభ్యర్థిగా పూర్వం ఎన్నికైనందున, కాంగ్రెసువల్ల ప్రాప్తించిన శాసనసభ్యత్వానికి, మున్సిపల్ ఛెయిర్మన్ పదవికి రాజీనామా ఇచ్చారు. స్వతంత్రులుగా మళ్ళీ శాసనసభకు నిలబడి, పోటీ లేకుండా ఎన్నికైనారు. తర్వాత 1952 లో మద్రాసు శాసనసభా సభ్యులుగా ప్రజాపార్టీ అభ్యర్థిగా ఎన్నికైనారు. తర్వాత ప్రకాశంగారితోబాటు యు. డి. యఫ్. లో చేరి శాసనసభలో ప్రతిపక్ష నాయకులుగాఎన్నికైనారు. మళ్ళీ యు. డి. ఎఫ్. తో విభేదాలువచ్చి దానితో తెగతెంపులు చేసుకున్నారు. పొట్టి శ్రీరాములుగారు రాష్ట్రసిద్ధికై ఆత్మార్పణంచేసిన వార్త విన్నంతనే కేంద్రప్రభుత్వం ఆంధ్ర రాష్ట్రనిర్మాణం చేయలేదని అసమ్మతి సూచనగా శాసనసభా సభ్యత్వానికి రాజీనామానిచ్చిన మొట్టమొదటి శాసన సభ్యులు వీరే. ఆంధ్ర ప్రజాసోషలిస్టుపార్టీ అధ్యక్షులుగా ఉన్నారు. ఆంధ్రోద్యమం సారథులలో వీరు ప్రముఖులు. త్రివేదీ సలహా సంఘంలో సంజీవ రెడ్డిగారితోపాటు వీరు సభ్యులై ఆరువారాల్లో ఆంధ్రరాష్ట్రవిభజన కార్యక్రమం జయప్రదంగా పూర్తిగావడానికి తీవ్రకృషి చేశారు. ఆంధ్రరాష్ట్ర ఆర్థిక పరిపాలనాది సమస్యలను చక్కగా అవగాహన చేసుకున్న ప్రతిభాశాలి. వీరు సంగీత సాహిత్యప్రియులు.



మంత్రి

## శ్రీ డి. సంజీవయ్య

కర్నూలుకు ఐదుమైళ్లలో పెద్దపాడు గ్రామంలో జన్మించారు. వయస్సు దాదాపు 30 ఏండ్లు. అనంతపురం ఆర్ట్సు కళాశాలలో పట్టభద్రులయ్యారు. మద్రాసులో న్యాయశాస్త్ర పట్టాన్ని పొందారు. తర్వాత రాయలసీమ మండలాల్లో ఇన్‌స్పెక్టరు ఆఫ్ సివిల్ సప్లయిస్‌గా పనిచేశారు. కొంతకాలం మద్రాసులో ఉపాధ్యాయులుగా ఉన్నారు. తర్వాత పార్లమెంటు సభ్యులుగా ఎన్నుకోబడినారు. గత ఎన్నికలలో కర్నూలు రిజర్వుడు నియోజకవర్గం నుంచి మద్రాసు అసెంబ్లీకి ఎన్నికైనారు. శ్రీ రాజగోపాలాచారి మంత్రివర్గంలో 18 మాసాలు మంత్రిఅయి, సహకార, గృహనిర్మాణ శాఖలపై అధ్యక్ష్యం వహించారు. సంగీతసాహిత్యాల్లో వీరికి మంచి ప్రవేశం ఉన్నది. ★



వైస్ ప్రెసిడెంట్

## డా॥ రాధాకృష్ణ

# కాలక్షేపం

ఉరుతర పర్వతాగ్రమునుండి
దృఢంబగు రాతిమీద స
త్వరముగ దెళ్ళికాయము
హతంబుగ జేయుటమేలు; గాలిపే
పరిగోర వాత గలిడుట బాగు;
హుతాశనమధ్య పాతమున్
వరమగు; జారుశీల గుణ
వర్జన మర్గముగాదు చూడగన్.

తా॥ ఎత్తయిన పర్వతశిఖరమునుండి కఠినమయిన రాతిమీద త్వరితముగా పడి దేహమును హతం చేయడం మేలు. సర్పశ్రేష్ఠముయొక్క నోటిలో చేయిపెట్టడం మంచిది. అగ్నిమధ్య పడడం కూడా మంచిదే. కాని, నీతిమార్గమును విడిచిపెట్టడం మాత్రము మంచిదికాదు.

నీతిమార్గం విడిచిపెట్టడం మంచిపని కాదు. నిజమే. కాని, సత్పథమును విడిచిపెట్టి ఒకవేళ అపథ్యం చేయడం సంభవించవచ్చు. అపథ్యం చేసినట్లయితే, అందుకు తగిన కర్మానుభవం అనేది కర్మసిద్ధాంతం ప్రకారంగా ఉండి తీరుతుంది. గారెలు ఎక్కువగా తినినట్లయితే, సదరు గారెలమీదనే అరుచి కలుగుతుంది. అంటే ఏమిటి? గారెలు చేదెక్కుతాయి. లేదా అవి జీర్ణము కానందువల్ల కడుపునొప్పిగాని, యింకా యితర విధములుగా జీర్ణకోశము చెడి, శరీరమే జీర్ణించిపోవుటగాని సంభవిస్తుంది. గారెలను మితిమీరి తినినందువల్లనే వ్యాధి బాధలు సంభవిస్తాయి. మితముగా భుజిస్తే అవి హితముగా ఉంటాయి. శరీరం రోగరహితంగా, అరోగంగా, ఆరోగ్యంగా ఉంటుంది. కాబట్టి గారెలయొక్క మంచిగుణం మితంగా భుజించడంలో ఉంది. గారెలయొక్క చెడుగుణము మితిమీరి తినడంలో ఉంది. హద్దుమీరి నడచినవారినే శిక్షిస్తారు. హద్దులోపల ఉండేవారిని శిక్షించుటకు యమధర్మరాజుకు కూడా సాధ్యంకాదు. మనలను నియమంలో ఉంచడానికే యముడు పొంచి ఉంటాడు. ఈవిధంగా ప్రతివిషయంలోనూ, ఏ మనిషి అయినా, తనకు భుక్తమయ్యేటటువంటి ప్రతి ఫలసాయము విషయములోనూ, పరిమితి అనేది లేకపోతే గర్వితమతి అవుతాడు. క్రిందుగా ఉన్న మీసాన్ని జర్మనుచక్రవర్తియైన కైజరు లాగున మెలియబెట్టి పైకెత్తుతాడు. కిర్రు చెప్పులు తొడిగిన ఆసామీకి కిర్రు ఎక్కువవుతుంది. రొమ్మువిరిచి కొమ్ములు తిరిగిన పండితునివలె "కరిభంగి సర్వమున్ జలిసితి నంచు" తిరుగుతాడు. భుక్తి మితిమీరినప్పుడు బొజ్జ బరువై భుక్తాయాసం కలుగుతుంది. మోతుబరీ ఆసామీవలె క్రింది చూపు లేకుండా పై చూపుతోనే నడుస్తాడు. మితిమీరిన స్థితిపరునివలె భుక్తి ఎక్కువైనవాడు, భుక్తాయాసంతో, "నిక్కెడు, నీల్గెడు, విర్రవీగెడున్"—

అయితే, మితి అనేది ఎట్లా నిర్ణయించాలి? ఆయా వ్యక్తినిబట్టి వారివారి ప్రకృతినిబట్టి నిర్ణయించాలి. ఆయా దేశపరిస్థితులనుబట్టి, ఆయా కాలమాన పరిస్థితులనుబట్టి నిర్ణయించాలి. నిజమే. కాని నిర్ణయించేవారు ఎవరు? ఈ విధంగా చేయబడే నియమ పరిమితి నిర్ణయములు కేవలము ఆయా దేశకాల పాత్రములనుబట్టి చేయబడే నిర్ణయములు గనుక, అవి ఆ దేశానికి, ఆ కాలానికి, ఆ జనులకు మాత్రమే తాత్కాలికంగా, తత్ప్రాంతీయముగా, తజ్జనోచితంగా వర్తిస్తూ ఉండాలి. కాయకష్టం చేసేవానికి ఎక్కువ రేషనుబియ్యం సప్లయిచేయాలి. కాయకష్టం చెయ్యనివారికి తక్కువ రేషను బియ్యం యివ్వాలి. పంట వృద్ధియై అధికాహారోత్పత్తి కల్గినప్పుడు, మనిషికి 16 ఔన్సుల రేషనుకూడా యివ్వవచ్చు. పంట అడుగంటినప్పుడు అష్టౌన్సుల రేషను యివ్వాలి. గోధుమలు బాగా పండే ప్రాంతంవారికి గోధుమలు ఎక్కువగా సప్లయిచేసి, బియ్యం తక్కువ సప్లయి చేయాలి. బియ్యం ఎక్కువగా పండే ప్రాంతం వారికి బియ్యం ఎక్కువగా సప్లయిచేసి గోధుమలు తక్కువగా సప్లయి చేయాలి. ఈ విధంగా, ఆయా ప్రజల కాయకష్టమునుబట్టియు, కలంకష్టమునుబట్టియు, ఆయా కాలసుభిక్ష దుర్భిక్ష విచక్షణను బట్టియు, ఆయా ప్రాంతాల ధాన్య ప్రాధాన్యమును బట్టియు, రేషను పరిమితిని నిర్ణయించవలసి వస్తుంది. కనుక, యీ నిర్ణీత నియమిత పరిమితులు స్థిరలింగములుగా ఉండేవి కావు. అవి చరలింగముల వంటివి. ఏమైనప్పటికీ, నియమిత పరిమితి అనేది సక్రమంగా సాగినంత కాలమూ ప్రపంచ చక్రం ప్రశాంతంగానే ప్రవర్తిస్తూ ఉంటుంది. కాని అది అక్రమంగా సంచరించినప్పుడు స్థిరలింగం చరలింగం అవుతుంది. చరలింగం యింకా చరచరలాడుతుంది. ఇక జనం ఇంక్విలాబ్ జిందాబాద్ అంటారు. విప్లవము వర్ధిల్లుగాక అని ప్రజాశక్తి ప్రజ్వలిస్తుంది. నిప్పులు చెరిగినట్లుగా, మూడో నేత్రం తెరచినట్లుగా, ముప్పువాటిల్లక తప్పదు. కాబట్టి ప్రజాశక్తి అనెడి పరమశివుడు మూడో నేత్రం తెరచినప్పుడు ఇక మన మొఱ ఆలించడు. మూడో కన్ను తెరచినప్పుడు, మొదటి రెండు కన్నులూ పూర్తిగా మూసుకుంటాడు. మన మొఱ వినకుండా రెండు చెవులు కూడా మూసుకుంటాడు. ఆ శివతాండవంలో, ఆ శివమెత్తిన విప్లవ కాండలో అంతా విపరీతమే. అదివరకు చేదువిషం అయిన మందులే, ఆ విషజ్వర సమయంలో అమృతప్రాయంగా త్రాగాలి. తియ్యని గారెలు చేదెక్కిన స్థితి యేర్పడినప్పుడు, చేదు వస్తువులనే, చేదుపాట్ల కషాయమునే త్రాగిస్తాడు వైద్యుడు. చేదెక్కిన నోటితో చేదునే మింగిస్తాడు. అదే శుభకరం అదే శివంకరం అవుతుంది. అసహ్యపడి యీసడించుకొన్నదే అమృతం అవుతుంది. విషం పీయూషం అవుతుంది.

జీవితనియమములను నిర్లక్ష్యంచేసి, భోగవతం ఆడినవానికి "రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా!" అనే స్థితి రావడం తప్పదు. "లావొక్కింతయులేదు—ధైర్యము విలోలంబయ్యె" అనే స్థితి వచ్చినప్పుడు, అదే గజేంద్రమోక్షం. ఈ విధంగా ఆలోచిస్తే, యీ విషమావస్థ సంభవించడంలోనే విమోచన మార్గం ఏర్పడినట్లయింది.

పంచాగ్నుల మధ్య తపస్సు చేయవలసినదిగా సలహాయిస్తే, పట్టపగ్గములులేని గజేంద్రుడు చేస్తాడా? తన మత్తేభయూథంబుతో, అనేక ఆడేనుగులతో అడవిలో గజేంద్రుడు తిరుగుతూ, దేవేంద్ర భోగం అనుభవిస్తున్నానని అనుకొన్నాడు.

(54-వ పేజీ చూడండి)

కౌరవసైన్యాన్ని చూసిన ఉత్తరకుమారుడు రథంమీంచి గభీమని గెంతినట్టుగా, జీవహింసచేయాలనే కృత నిశ్చయంతో వస్తోన్న తోటమాలీని దగ్గరగా రానిచ్చి గోడమీంచి చెంగున రోడ్డుమీదికి ఉరికింది నల్లటి కుర్రమేక.

తోటగల ఆసామీ తోటచుట్టూ దిట్టంగా ఎత్తుగా గోడ కట్టుకున్నాడు. కాని ఆగోడకి ఒకచోట ఒకవార మ్యునిసిపల్ చెత్త డబ్బా ఉంది. సరిగ్గా అక్కడే ఆగోడకి ఒక ఇటిక జారింది. ఈ రెండు భోగట్టాలూ తోటగల ఆసామీ గమనించలేదు. నల్లమేక గమనించింది.

నిచ్చెన వేసుకొని స్వర్గానికి వెళ్ళినట్టుగా, చెత్తడబ్బానీ, ఇటిక జారినసందునీ ఆధారం చేసుకొని తోటగోడ ఎక్కింది నల్లమేక.

పేరుకి పిట్టగోడే కాని, నిజానికి ఆగోడ చాలా ఎత్తుగా ఉంది. లోనికి గెంతితే మళ్ళీ పైకి రాడానికి అటువైపు చెత్త డబ్బాలూ, జారిన ఇటికలూ లేవు. అందుచేత, గోడమీదనే నిల్చొని,

"ఈ మనుష్యులు గడుసువెధవలు" అనుకొంది నల్లమేక.

నల్లమేక భారతం చదవలేదు. హరికథలయినా వినలేదు. అందుచేత అది ఎరగదు, గడుసుతనంలేని కుర్రవాడు అభిమన్యుడని ఒకడుండేవాడని.

మేకల్లో అభిమన్యుడివంటిదికాదీ మేక. పద్మవ్యూహంలా ఉండే ఆ తోటలో ప్రవేశిస్తే మళ్లీ బైటకి రావడం కష్టమని గుర్తించిన నల్లమేక, గోడమీదనే నిల్చొని పస్తాయించి చూసింది.

కిందికి గెంతే నవసరంలేకుండా, దానికి అందుబాటులో నాలుగు క్రోటన్సు చెట్లూ, ఒక లేతమామిడి మొక్కా, ఒక వేపచెట్టూ ఉన్నాయి.

భారతీయులకి సీమకూరలమీదా, మేక జాతికి క్రోటన్సు కొమ్మలమీదా మోజు ఎక్కువ.

అందుచేత నల్లమేక గోడమీదుగా, తిన్నగా, క్రోటన్సు చెట్లవైపు నడిచి, అందులోనూ ప్రిన్స ఆఫ్ వేల్సని ఎంచుకొని, ప్రౌఢమైన మూతితో, చురుకైన పండ్లతో ఉపాహారం సేవిస్తూ, మాటిమాటికీ తన పొట్టితోకని విలాసంగా ఆడిస్తూ, ఓరకంటితో అటూ ఇటూ చూస్తోంది.

విలాసంగా, కులాసాగా ఉన్న నల్లమేకని తోటమాలీ చూడ్డం, చూడగానే అతను పళ్ళు బిగించి దుడ్డుకర్రని చేతపట్టుకోడం, పట్టుకొని చడీ చప్పుడూ లేకుండా చల్లగా రావడం అన్నీ ఒకటి రెండు నిమిషాల్లో జరిగేయి.

మేకలు మెడతిప్పి వెనక్కి చూడగలవు. మెడ తిప్ప నవసరం లేకుండా ముందుకీ పక్కలకీ చూడగలవు. ఒకవైపు చూస్తున్నట్టుగా ముఖం పెట్టి ఇంకోవైపు చూడగలవు.

## రాచకొండ విశ్వనాథశాస్త్రి

ఈ శక్తులన్నీ ఈ మేకకూడా ఉన్నాయి. అంతేయగాక, ఈ యొక్క నల్లమేక కుర్రదయినప్పటికీ, కాన్వెంటులో చదివే ఆతతాయి పిల్లలకి పాఠాలు చెప్పగలిగిన ప్రజ్ఞావిశేషం గలది. బహు చురుకైనది.

తోటమాలీ కేం తెలుసునయ్యా ఈ నల్లమేక సంగతి?!

గోడమీద మేక తనని చూడలేదనుకున్నాడు, పాపం, అమాయకుడు.

అతను దొంగచాటున చేసే యుద్ధ ప్రయత్నమంతా మెడ తిప్పనైనా తిప్పకుండా కనిపెట్టిన నల్లమేక, అతణ్ని వీలయినంత దగ్గరగా రానిచ్చి, ఈలోపున వీలయినన్ని క్రోటన్సు ఆకులు భక్షించి, ఆఖరిక్షణాన్న అతగాడికి తన పొట్టితోక చూపించడమే కాకుండా, అతణ్ని

"పోరా! బృహన్నలగా!"

అనే తిట్టుతో సమానమైన మేకతిట్టు తిట్టి, చెంగున ఉరికింది రోడ్డుమీదికి.

ఇష్టంలేని పనిచెయ్యడానికి రెండున్నర మైళ్ళు ఎండలో నడవ్వలసి వస్తే మనిషన్నవాడికి ఎంత కోపం, దుఃఖం, చిరాకూ కలుగుతాయో, అంత కోపం, దుఃఖం చిరాకుతో ఎండలో చెమటలు కక్కుకుంటూ నడుచుకు వస్తున్నాడు ఆఫీసరుగారి నౌఖరు.

తమ తమ భర్తల ఆఫీసుల్లో పనిచేసే నౌఖర్లని, ఆయా ఆఫీసర్ల భార్యలు, ఎండలో ఏయే పనులమీద పంపిస్తారో అట్టి పనిమీదనే అతణ్ని అమ్మించింది ఆఫీసరుగారి భార్య.

ఆఫీసరుగారి భార్యకి ఒక సర్రియలిస్టు ప్రియుడు ఉన్నాడు.

అతనొకసారి ఆమెతో,

"నీ కన్ను, పెదవి, తల, కాలు, నలుపు, ఎరుపు, పువ్వు, చెప్పు, చడీ చెయ్యక, చప్పుడు చెయ్యక, ఎవ్వరితో చెప్పక చెప్పక, చీకట్లో నలుపుల్లో, పువ్వుల్లో ఎరుపుల్లో పెట్టి నిచ్చెన ఎక్కినాకు ఇచ్చెయిచ్చెయ్" అన్నాట్ట.

ఆఫీసరుగారి భార్య పొడవు : 4' 6"

ఆమె సర్రియలిస్టు ప్రియుడి-

పొడవు : 6" 3½"

అందుచేత ప్రియురాలికి నిచ్చెన అత్యావసరం.

ఆ ప్రియునకు ఆమె ఏమి యిచ్చినదో ఎవరికిన్ తెలియదు. చెప్పులుమాత్రం ఇవ్వలేదు. సర్రియలిస్టూ, ఎవ్వరికీ ప్రియుడూ కానట్టి తన నౌఖర్ కి మాత్రం ఒక పాత చెప్పులజత యిచ్చింది. అవే అతను తొడుక్కున్నాడు.

ఆ చెప్పులు అతనికి కొంచెమూ సరిపోవు. అవి అతణ్ని హెచ్చుగా కరుస్తున్నాయి.

ఆఫీసర్లూ, వారి భార్యలే కాకుండా వారివారి చెప్పులు కూడా కరుస్తాయనడానికి ఇదొక నిదర్శనం.

నల్లమేక ఉరికినప్పుడే, ఆఫీసరుగారి నౌఖర్ యొక్క కుడికాలి పాత చెప్పుకి కుట్టు తెగింది.

చెప్పు తెగేసరికి అతగాడు "సచ్చేన్రా బగమంతుడా" అనుకున్నాడో, "బతికించేవ్రా బగమంతుడా" అనుకున్నాడో ఎవరికీ వినిపించలేదు. ఏదో గొణుక్కుంటూ, చెప్పు ఎక్కడ తెగిందో చూసుకొండికి వంగున్నాడు.

శరవేగం గంటకి పదిహేను మైళ్ళయితేనే ఆ మోటారుకారు శరవేగంతో వస్తోం

# అంతులేని రజపవర్గం

కవికొండల వెంకటరావు

అది యొక మహావృక్షం. మఱ్ఱి చెట్టు కాదు మద్ది చెట్టు కాదు. బూరుగు చెట్టు కాదు. దాని పేరు నాకు తెలియదు. అక్కడున్న వాళ్లొకళ్లూ చెప్పలేక పోయినారు. అయినా గానీ దాని స్వరూపం చాలా పెద్దది. చాలా విడ్డూరమైంది. ఎత్తు ఇరవై నిలువులు. వలం కొమ్మలు విడిచి కైవారం కొలిస్తే రావణాసురుడి ఇరవై చేతులు చాలవు కౌగిలించుకోడానికి. పూలు చూడొస్తే నీళ్లలో కనబడే పద్మాలకు, మెఱకను బొడమే బ్రహ్మదండిపూలకూ మధ్యస్థపుష్పాలుగా వుంటాయి. నఱికితే వేయి వేటులకైనా తెఱగని వంటచెఱుకు. ఆంజనేయులుకూడా ఊపవెఱుకలేని మొదలు. ముళ్లుకూడా అక్కడక్కడున్నాయి విదుపందికున్నట్టు. ఆకులు అతి పచ్చ అతిచిక్కనా. ఆకారానికి కర్రపెండల పాకుల్లాగుంటాయి. కాని ఒకదానిమీ దొకటి, సూర్యకిరణాలు కూడా దూరేందుకు సందు లేకుండా, అలా రాంభజన పెమ్మ కొమ్మల్లాగుండడం చేత, అంతరువులుగల మేడెక్కుతూన్నట్టే చెట్టు కెగబ్రాకుతూంటే! అసలు ఎగబ్రాకే వాడంటూ ఒకడుండాలి. మఱిన్నీ గ్లోబులు వ్రేలాడేలా వ్రేలాడి పొడుచుకొచ్చే మొగ్గ దానిది. కాయ లెల్లావుంటాయో కని పెట్టడాని కంతలోనే పెద్దగాలీ వాన వచ్చేశాయి. చెట్టువంక చూస్తూవుంటే, చెట్టంతా రివటలాగ ఊగిపోతూవుంది. టప టపా చినుకు పైనుండి పడసాగింది. దాని మొదట అలికివుంది. అక్కడి సామా నిక్కడకు ఇక్కడి సామానక్కడకు, ఎక్కడెన్నా

పొడి జాగా ఆ చెటు చూపించదా అని, ఆ చెట్టుకో తొఱ్ఱైనా వుండకపోతుందా అని, సరుకూరికే సర్దుతూవుంది ఒక జరఠ.

నాకెన్నాళ్లనుంచో ఆలోచన "అవృద్ధురాలా వృక్షాన్ని అసలు విడిచిపెట్టి ఏ కొడకైనా పోకూడదా? ఎంత వర్షం కురిసినా దానిక్రిందనే తనువు తడుపుకుంటూవుంటేను!" అని. కాని కనిపెటే అవకాశం ఎన్నడూ ఆ వఱకు కలుగలేదు. ఆనాడు కలిగింది. వర్ష మతిజోరుగా కురుస్తోంది. గాలి మరీ విసురుగా వీస్తోంది. ఆకాశం నల్లని మబ్బును త్తరించి మెఱపునీతికి యిచ్చి పోయెని.

"వరదకు తోడు వానా?" అంటూ ఏదో నసుకుతూవుంది, అంత ఇదిలోను తానో పరాయి సణుగుపరామర్శిస్తూ. "ఈ పంచను వండుకోండి! ఆ పంచను పండుకోండి అని అంటేవాళ్లసామ్మేంపోయింది? పక్కనున్న వెలమవారుసయేతం అన్నారే ఈ చిక్కప్పుడెక్కడకు పోతాను. ఆ పాశం నోగెట్టు కనలేకపోయిందే నామరల? మళ్ళీ మెఱక వీధినుంచి" అని ఒకటే పణుగు ఒకటే గొణుగు రస్తా అమ్మటప్రణముగ్య. కాని ఈ ముసిల్ది ఆ సణుగుపరామర్శిస్తూనువుంది, పేలిపోయిన గాజుబుడ్డి తీస్తూనూవుంది, కారిపోయే రేకు డబ్బా చూస్తూనువుంది. వాన! వాన! వాన! ఉహూహూహూ! అంటూ వణికి పోతూనూవుంది.

"ఏమి అమ్మా వరదకు ముందే వచ్చివున్నట్టున్నావు ఈ చెట్టుక్రిందకు నువ్వు?" అని అడుగుదాం అని నాకు ముందు తోచింది కాని ఆమె యొక్క ఆ అవస్థలో అడిగితినా ఆమెకు అండపోగొట్టిన వాణ్ణి అవుతానేమో అని భయంవేసింది. ఇంతకూ నేమూసిన ముసిల్ది ఆ నాటి దెవర్తో ఈ నాటి దెవర్తో? ఈమె నిజంగా వరదబాధితకావచ్చు" అని అనుకున్నాను.

"నీ యింటికంటూ వరదవచ్చిందా? నీదెక్కడ అసలు కాపురం? నీ యిల్లు కూలిపోయిందా?" అని మంచి వుద్దేశ్యంతో నే నడిగినా ఆమె అదో ఓఘూయిత్యపు శాపంలా అర్థం చేసుకుని ఎక్కడ తిట్టిపోస్తుందో అని భయంకూడా వేసింది.

ఇంతకూ ఝంఝామారుతం, మత్తుగోలు పుబూ వుంటే మొత్తేస్తూవుంది వాన! అంత చెటూ అంతరాళంలో శివాడుతూవుంది. వ్రేళ్లవంక చూచేని భూమి పగుల్లేదు. చెట్టు వ్రేళ్లన్నీ మట్టిలోనే కప్పడివున్నాయి పైనున్నవల్లా ముసిలిదాని కాలివ్రేళ్లు చెట్టు చివళ్లు చూచాను. చిఱుగలేదు. తఱుగలేదు. ముసిలిదాని చేతివ్రేళ్లు మాత్రం బడలి బక్కగావున్నాయి, ఒక కొమ్మను వ్రేలాడగట్టిన ఉట్టి ఊడిపడిపోకుండా పట్టుకునే ఉద్యమంలో! తక్కినవన్నీ

ఏమైనాసరే ఉట్టి తెగకూడదని ఆమె వాంఛితంలా తోచింది.

అయినా, వాన ఎక్కువైన కొద్దీ గాలి ఎక్కువైనకొద్దీ; చెట్టు ఊగిసలాడే వెస వెలితిలో ఆమెను ఒక ప్రశ్న వేయ బుద్ధి పుట్టింది. "రేత్రి నీ కూటిమాటేమిటని?" ఆమె దూరాన్నే వానలోనే ఎన్నటికి ఆరిపోని నెగడిమంటలాంటి ఒకానొకమంటను చూపి, "ఆరుబయట, ముందు, వాన రాక ముందు, రాజేసి రగులబెట్టి ఎసర జేశాను. ఇంతలోకే ముమ్మరంగా దిమ్మన కొట్టి కురిసేస్తూవుంది వాన! దేని ఋతు ధర్మం ఏది మానుతాది? అదిగో మంట పోయికింద, గాలిచాటుగా జల్లుచాటుగా పోయిగడ్డలమర్చే నేమో భగభగ భగ్గున అగ్గి, గాడిలో వాడి మాపేనట్టు దేదీప్యమానంగా వెలిగిపోతూంది ఎసరు కళ కళలాడుతూ శబ్దిస్తూవినవస్తూవుంది వింతగావిను," అంటూ ఉట్టిమీదనుండి గుప్పెడు ఎఱ్ఱబియ్యం పట్టుకువెళ్ళి ఆ ఎసటిలో పోసింది "అవి కాన! నాకూ వాళ్ళకూ మాపటికి గంజికి!" అంది తిరుగవచ్చి తడిసిపోయిన నెఱిసిన జుట్టు ఆరబట్టుకుంటూ. ఎఱ్ఱటి బియ్యం పట్టుకు వెళ్ళింది అని ఎల్లా అనగల్గానూ అంటే, ఒక గింజ నల్లనిబాడిలో పడింది — చెట్టుక్రింద చెట్టు మొలవదు, ఇంతకూ అది బియ్యపు గింజ, వండితే ఉరవవాలిగాని మొలకెత్తదు "వాళ్ళంటూవున్నావు! నీవు కాక నీ తిండిలో వంతుకువచ్చే వాళ్ళింకా వున్నారా?" అన్నాను "ఉంగు! ఈ చెట్టుకో తొఱ్ఱవుంది నేను చూడగల్గాను నెమకులాటలో! ముందు తొర్రలో వర్ర బుర్రపెట్టనియ్యి, వర్రనీళ్లు కారినా మళ్ళీ తొంగోడానికి జాగా కనిపించదు" అంది "ఈ కసపిస మనే నేలమీదింకా ఈ రాత్రి తొంగోవాలనే నీయూహ?" అని అడిగాను. "బాబా వరదబాధితులకు వకలక్ష రెండు లక్షలు మూగులక్షలు అంటూ కోటాను కోట్లయ్యేలా నిధులు ఏర్పరిచి, "లోనులు"గా, హాట్ మెంట్లుగా, 'అంగీలు లుంగీలుగా' హావల్దార్ల చేత సుబేదార్ల చేత పంచిపెట్టిస్తున్నారు నాకు నాటికి నేటికీ ఇల్లూ లేదు వరదా లేదు. నేనేరకం బాధా ఒకటి కెలుకపరచింది లేదు ఈ మొక్క ఏలా అయితే పెరిగిందో ఆలా పెరిగాను పిపుగావున్నప్పుడు నారూపుమాడని, పాప మొల్లని పసుముకుల్లకు లేదు దీపంపెట్టి ఎరుగను. నా జీవనం నూటొక్క యేడుగా వొంటి తీగ మీటించాను ఈ చెట్టుక్రిందే, దాని పెంటదినికే తుగుస్తూ, కంటెగూర్కు గంటూ, అనుకుంటూ ఆరుబయట పొయ్యో ట్టుక, పొగఅంతా పొలానికి, సెగ అంతా నాకు అన్నట్టు, ఆనందం పొందేను. ఈ మధ్యను వరదవచ్చిందటగానా మానుకు తను లేదు ఆసాని నాదిమన్నెంమెలిక అయితే కొత్తగా గట్లొయ్యడానికి, పారలేసుకు, గడ్డపారలేసుకు ఉప్పరులు వచ్చేరు, గుంటూ రోళ్ళో, నెల్లూరోళ్ళో వాళ్ళవూళ్లోను వాళ్ల కిళ్లు లేవంట. వాళ్ళవూళ్లోను వాళ్ళకు పెళ్ళాలు లేరంట. ఆలాంటి రికామీ గాళ్ళిద్దరు, కవలల్లా ఒకడు బుజాన్ని పారేసుకు ఒకడు బుజాన్ని గడ్డపారేసుకు నావైఖరి చూచి ఈ పొద్దె చేరమాకుకున్నారు వాళ్లు రోజూ శేరు బియ్యం తేవడానికి, నేను మాపులు గంజికాచి పోయతానికి" అంటూ గొడవ లాగు నుడవజొచ్చింది వానధాటి తగ్గిన కొద్దీ ముసిలిదాని గొంతు ఖంగు ఖంగునా వీనుల్లో మోగింది ప్రాయంలో వుంటే పల్లెకతట్టుమ్మకు వాళ్లతో మచ్చిగా వుండేదే కూడా కూడా!

దూరాన్నే ఆచ్ఛాదన లేక, ఆర్భాటం లేక, నల్లని శరీరం, నడుమునో పంచె ముక్కు, బుజాన్ని వాళ్ల పనిముట్లు-ఆ వయసు వాళ్ళిద్దరూ రావడంగన్నాను "మఱి వాళ్లు తెచ్చే బియ్యం రేపటికా?" అన్నాను. "బియ్యం బియ్యం! ఆళ్ళకెవరిస్తారు? రొక్కమే తెచ్చేరులాగుంది!" అంది ముసిల్ది. వాళ్లుదాని చేతిలో చెరో అర్ధరూపాయపడేసి చతికల పడేలో — నేను మఱి అక్కడ వుండడం మంచిది కాదనుకున్నాను వాన వెలిసింది. గాలీ తగ్గింది పొయిమీగున్న అటకమీద తబిశె ఉబికుబికి పడిపోతూవుంది

"గంజైతే కుసింత పొయ్యి! వర్రుందా ఉప్పుందా?" అని అడిగేరు ఉప్పర్లు. ఉప్పు వానకు కరిగి నీరైపోనాది వర్ర తొర్రలో వుంది గంజి అయ్యేని! నావో గుప్పెడు 'ఎలుడా' బియ్యంవుంటే, ఒంటి పట్టు వెసట్లో పోశాను," అంది "బతికించావు మామ్మా!" అన్నారు, వాళ్ళిద్దరూను "గంజే పూడ్చుమా? కడుపునిండే పొలమే పూడ్చుమామాం వుప్పరులం. గండిలు పూడ్చడానికే పుట్టాం! ఉప్పు మా పేరులోనే వుంది. సప్పనైతే అయిందిగాని పచ్చాకూడంత వెచ్చెచ్చగా వుంద — ఇంకా కుసింతగంజి పొయ్యి!" అనే వాళ్ళవూసు నేను వారి నుండి దూరమయ్యేలో, 'హోరన్' కొట్టినట్టు వినవచ్చింది

నా మనస్సులో ఒక మాదిరి మాంద్యం బయలుదేరింది కష్టపడేవానికి ఇల్లు కట్ట ముందు ఇవ్వాలా? నష్టపోయిన వానికి పుష్టి గొలపాలా? నష్టపోయినవాడొకప్పుడు కాక పోతే ఒకప్పుడన్నా నవనాగరికత ఎరిగున్న వాడు వీడసలే ఎఱుగడు, వీణ్ణి చూచే దెవరు?" అని అనుకొంటూ, అంతులేని రాజమార్గాన్నే నడిచేను దాని చివర స్వర్గముందా అన్నట్టు! ★








# రాంగ్ రూట్ బుష్‌కోటు

సుబ్బారావు వాచీ చూసుకున్నాడు. అది ఆగిపోయి ఉంది. 'కీ' యిచ్చినా అరగంటకన్నా ఎక్కువ తిరగదు. తిరిగితే ఎంత? తిరగకపోతే ఎంత? 'వాచీ చేతి భూషణం' అన్నారు దాని ఉపయోగమూ అంతవరకే దగ్గిర నిముషానికి సరిగ్గా టైము చూడ్డం రాని ఆడాళ్ళ చేతిని వాచీలు చాశాడతను సంస్కృతికీ, శిల్పానికీ తావియ్యక, చాలామంది చిన్నపిల్లలు తెలీక రంగురంగుల బొమ్మలకోసం, పెద్దవాళ్ళలా వాళ్ళ చేతికి వాచీలకోసం అల్లరి పెడతారు ఆ వాచీలు తిరగకపోయినా సంతోషం తగ్గదు రంగురంగుల రబ్బరు బొమ్మల గుండెలు కొట్టుకోకపోయినా వాళ్ళు ప్రేమించగలరు సుబ్బారావులాంటి చాలామంది పెద్దలూ అంతే రంగులూ, అలంకారాలూ కావాలి వాళ్ళకి వాటి ప్రయోజనం సంగతి ఆలోచించనే ఆలోచించరు

సుబ్బారావు వాచీవైపు సగర్వంగా చూసుకున్నాడు అయితే ఆ గర్వం ఆట్టే సేపు నిలబడలేదు కాళ్లదగ్గిర కూర్చున్న ఓ మనిషి 'ఎంతేసినారు బాబూ?' అని అడిగేశాడు తన్ని ఏడిపించడానికిగాని వీడికి టైమెందుకు? అయితే ధీరుడైన సుబ్బారావు ఊరుకోలేదు తడుముకోకుండా 'తయా, యిరవై' అన్నాడు అయితే దీనికి ప్రతి సమాధానం వస్తుందని సుబ్బారావు ఊహించలేదు 'క్షమించాలి మేసారూ అంత అవలేదు మీ వాచీ ఫాషు తిరుగుతోందేమో—పావు తక్కువ ఆరయిందోయ్' ఇలా జవాబిచ్చిన కోయిలకంఠి వైపు సుబ్బారావు దృష్టి సారించాడు రెండు బెంచీల అవతల ఆవిడ కూర్చుంది ఓ మూలగా అప్పుడే వెలిగిన పాసింజరు లైటు వెలుగులో ఆవిడ అప్సరసలా కనిపించింది సుబ్బారావు కళ్లకి. నాలుగురోజులు వరసగా మాట్లాడితే ఆడదాని కంఠం ఎలా ఉంటుందో, నాలుగేళ్ళు కాపురం చేస్తే ఆడది ఎలా మారిపోతుందో యిరవై ఏళ్ళ సుబ్బారావు కేం తెలుసూ? ఆ క్షణానికి మాత్రం ఆవిడ కంఠం కోయిలకంఠంలా, ముఖం పద్మంలా ఉన్నాయి సుబ్బారావుకి

ఇంతవరకూ ఈవిడని గమనించినందుకు సుబ్బారావు నొచ్చుకున్నాడు ఈ 'సౌంగర్య తిలక' ఏ 'హంపీ' స్టేషనులో ఎక్కిందో? తను యిలా బయలుదేరింది ఈ 'చిలకల కొలికి'ని కలుసుకోడానికేనా? అసలు తనెందుకు బయలుదేరినట్టు?

సుబ్బారావు స్వస్థలం తుని వాళ్ల తండ్రి బెల్లం వ్యాపారం చేసి ఏదో ఉన్నవాడు అనిపించుకున్నాడు సుబ్బారావు ఒక్కడే మొగపిల్లాడు అవడంచేత కాస్త ముద్దుగా పెరిగేడు స్కూలు ఫైనలుతో కుస్తీ పట్టి పట్టి, దండయాత్రలలో గజనీ మహమ్మదును తలదన్ని—ఇక స్కూలుఫైనలు దాటలేనని, ఫైనలుగా స్కూలే విడిచిపెట్టేశాడు తండ్రి అక్కడితో వీడిమీద ఆశా విడిచిపెట్టేశాడు. అభాగ్యులైన తోటి విద్యార్థుల్లా — చెదపురుగు చదువుతో శరీరాన్ని గుల్లచేసుకోనందువల్ల— అమోనియా పిండి ఎరువుతో బలిసిన మామిడి పండులా పదహారేళ్లకే ఫహిల్వాను అయ్యాడు అలా యిక్కడా అక్కడా కబుర్లు చెపుతూ- చీకూ చింతా లేకుండా- ఈ నాలుగేళ్ళూ గడిపేడు.

## అవసరాల రామకృష్ణరావు

'వీడికి పెళ్ళేనా చెయ్యండి' అంటుంది తల్లి

'ఎందుకూ? వీడ్ని కన్నందుకు 'రాముల వారి పెళ్ళి'లా మనకి నిత్యం జరుగుతున్న పెళ్ళి చాలదూ? వీడికి ఉన్న 'క్వాలిఫికేషన్లు' చాలు' అనేవాడు తండ్రి

ఇదిలా ఉండగా రైల్వేవారి శతదినోత్సవాల ధర్మమా అని 'గో వేర్ యు లైక్' టిక్కట్లు అమ్మేరు. రెండ్రోజులు సుబ్బారావు మంచంబట్టే ప్రయాణానికి పంపకపోతే 'పోలీసు నూతి'లో పడతానని బెదిరించగా - వీడి అల్లరి, అమాయకురాలైన పెళ్లాం గోలా ఎక్కువై చేసేదిలేక - పున్నామ నరకంలోంచి తప్పించుకోలేక - ఆ వెర్రి తండ్రి బొడ్లో తాళాలు తీసి కొడుకు మొహాన్న గొలేసు మంచం మీంచి ఎగిరి గంతేసి ఆ మాయదారి కొడుకు మరునాడే రైలెక్కేడు!

బాగా చీకటి పడింది. రైలు కిటికీలోంచి చూస్తే నక్షత్రాలు తప్ప మరేం కనిపించడంలేదు. 'ఈరాత్రి ఏ ఊళ్లో దిగుదామా?' అన్న ఆలోచనతో కొట్టుకుంటున్న సుబ్బారావు అప్రయత్నంగా ఆ అమ్మాయివైపు చూశాడు. ఆ అమ్మాయి సరిగ్గా తనవైపే చూస్తోంది ఎందుకలా చూడాలి? సుబ్బారావుకి గిలిగింతలు పెట్టినట్టయింది ఆ ప్యాసంజెరు పెట్టిలో ఆట్టే మంది లేరు సుబ్బారావూ, ఆ అమ్మాయీ, మరో నలుగురు మొగాళ్లూ, ఒక ముసలావిడాను.

ఖరగ్ పూర్ లో నూకరాజు ఉన్నాడు. పన్నెండింటికి ఖరగ్ పూర్ చేరుతుంది రైలు.

ఈ రాత్రికి అక్కడుండిపోయి - రేపల్లా అక్కడ గడపలేనో? - ఎల్లుండి కావలిస్తే కలకత్తా వెళ్లొచ్చు బాగుం దనుకున్నాడు సుబ్బారావు

ఆ అమ్మాయి మళ్లీ తనవైపు చూస్తోంది. ఎప్పుడూ లేంది తనకు సిగ్గేస్తోంది. ఎందుకు వెయ్యాలి? ఆ అమ్మాయి తన గుండెలవైపే ఎందుకు చూడాలి మరి? తన మీద తన కెంతో అభిమానం వేసింది సుబ్బారావుకి. లెట్రిన్‌లోకి వెళ్ళి అద్దంలో తన ముఖం ఆనందంగా చూసుకున్నాడు. ఎత్తైన తన ఛాతీని సగర్వంగా చూసుకున్నాడు. అందుమీద మెరుస్తున్న ఆరెంజ్ కలర్ బుష్‌కోటు - సంతోషంతో ఎగురుతున్నట్టుంది. ఆ అమ్మాయికి తను కావాలా? తన్ని పెళ్ళి చేసుకుంటుందా? ఊటలూరుతున్న ఆలోచనలతో తన సీటు చేరుకున్నాడు.

'ఏ వూరు వెడతారో అడగివచ్చునా?' కష్టపడి వాక్యాన్ని ఫ్రేంచేసి, ధైర్యం చేసి అడిగేశాడు సుబ్బారావు

'దాని కేముంది? ఇంకా రెండు స్టేషన్లున్నాయి కాని చాలా రాత్రయిపోయింది. మీరు?' సుబ్బారావు అవకాశాన్ని జారవిడుచుకోలేదు. ఈ బైరాగి టిక్కట్టుతో ఎక్కడేనా దిగొచ్చుగా! ఆ వూరూ చూసినట్టు ఉంటుంది, ఈవిడని దిగబెట్టినట్టూ, ఉంటుంది. అదృష్టం ఉండాలి గాని తను ఆ వూరి అల్లుడు అయ్యే అవకాశం మాత్రం ఎందుకు లేదు? - ఏ అవకాశమూ లేకపోతే ఈ సుందరాంగి తనవైపు, తన ఛాతీవైపు అస్తమానూ ఎందుకు చూడాలి?

ఆవిడ్ని గురించి ఇంకేమీ అడగలేకపో

యేమ. వాళ్ళ వాళ్ళు తనగురించే అన్ని సంగతులూ అడిగే శుభ తుణాలు రావచ్చు. ఎవరు చెప్పగలరు? - ఈ పగటి కలలతో - స్టైలుషాపులతో పదకొండు అవనూ అయింది, ఆ వూరు రానూ వచ్చింది. సుబ్బారావు గబుక్కుని లేచి నిలబడ్డాడు. అమ్మోయ్, ఆవిడ నిద్రపోతున్నట్టుంది!

'ఏమండీ - మిమ్మల్నే - లేవండి, స్టేషను వచ్చేసింది!' ఆవిడ ఉలికిపడి లేచింది.

'చాలా థ్యేంక్సండీ! లేపకపోతే ఏ కలకత్తాలో లేచేదాన్నో!' ఆవిడ డోర్ దగ్గర నిలబడి అయిదునిమిషాలు ఇటూఅటూ చూసింది. ఇంత మొహం చేసుకుని - 'ఉత్తరం అందలేదు కాబోలు - ఎవరూ రాలేదు' అంది.

'ఫరవాలేదు - నేనూ వస్తాగా... దిగండి, సామాన్లన్నీ లెక్క పెట్టి, దింపించి ఆవిడ్ని జట్కా ఎక్కించాడు సుబ్బారావు.

'సమయానికి మీరు సహాయం చేశారు గాని...' అంది ఆవిడ.

'ఆ, దానికేముంది? నాకీ వూళ్లో ఎలాగా పనుందిగా!' అన్నాడు సుబ్బారావు.

ఈ అన్నులమిన్న తనని ఎలాగా ఈ రాత్రికి ఉంచేస్తుంది, తండ్రికి పరిచయం చేస్తుంది... ఆ తరవాత? సిగ్గేసింది సుబ్బారావుకి.

'మీది ఈవూరేనా?'

'ఆఁ' అనేశాడు సుబ్బారావు ఐస్ అయిపోతూ.

'ఈ పక్క గల్లీలోనే మా యిల్లు'

'అలాగా?'

'ఒకటడుగుతాను - మరోలా అనుకోరు గదా?'

ప్రేమ, పాకాన్ని పడింది. సుబ్బారావు మనస్సు గజం ఎత్తున ఆకాశంమీద ఉంది. ఇలాంటి పట్టులోనే తను బెట్టు చెయ్యాలి!

'అడగండి, దానికేం?'

'ఈ బుష్‌కోటుకి, గుడ్డ ఈ వూళ్లోనే కొన్నారా?'

తన బట్టలగురించి కూడా అడుగుతోంది! వాళ్ల నాన్నతో చెప్పి రకరకాల బట్టలూ, కోట్లూ కుట్టిస్తుంది కాబోలు!

ఆహా, ఏమి, నా భాగ్యమూ? అనుకున్నాడు సుబ్బారావు.

కాదనడ మెందుకు - అనుకుని-

'ఈ ఊళ్లోనే కుట్టించుకున్నాను- ఏం?' అని అడిగేడు సుబ్బారావు.

'ఇందాకటినుంచి చూస్తున్నాను- సరిగ్గా అదే రంగు' అంది ఆవిడ.

'ఏమిటి?' అని అడిగేడు సుబ్బారావు ముందు సంభాషణ ఎంత ముళ్ళదారిలా, కర్ణ కఠోరంగా తన చెవికి ఉంటుందో తెలీక.

'అదే-మీరు తొడుక్కున్న బుష్‌కోటు రంగు.'

'దేనికి?' అన్నాడు సుబ్బారావు.

'ఇంకా యిలాంటి గుడ్డ దొరుకుతుందా? మరోలా అనుకోకుండా వుంటే రేపో, ఎప్పుడో మీకు వీలయినప్పుడు నాలుగు గజాలు తెచ్చి పెడతారా?'

ఎంత చనువు వచ్చేసింది అప్పుడే! తన జాకట్లకి గుడ్డ సహా పురమాయిస్తోంది! తెల్లవారాలే గాని - ఊరంతా గాలించిఅయినా తాను గుడ్డ కొని ఈ 'ఫుల్ మూను'ను కప్పకపోతే తాను ఎందుకూ?

'తప్పకుండా తెచ్చి పెడతాను' అనేశాడు. అనడు మరి?

'మరేం లేదు. మా ఆయనకి యిలాంటి బుష్‌కోటు గుడ్డలూ - యీ రంగులూ ఫేషన్లూ అంటే వెర్రి అభిమానం - అమధ్య ఒక షాపులోకి అచ్చు యిలాంటి గుడ్డే వస్తే ఆయన ఫ్రెండు కుట్టించుకున్నాడు. ఆయనా కుట్టించుకుందామని 'కన్సెషను' కోసం నన్ను 'షాపింగ్'కి రమ్మన్నారు. నేను వంటలో కొంచెం 'డిలే' చేశాను. ఆ రకం గుడ్డ అయిపోయింది. అన్నయ్యలాంటివారు కాబట్టి మీతో చెబుతున్నాను - ఆగోజునుంచి వారు నన్ను దెప్పని రోజు లేదు. ఆతర్వాత రెండుసార్లు వెళ్ళినా సరిగ్గా యిలాంటి గుడ్డ దొరకనే లేదు. మళ్లీ ఆ రకం గుడ్డ యివాళే చూశాను. మా యిల్లు వచ్చేసింది. వస్తానూ! రేపు కనపడతారుగా!' ఆవిడ దిగిపోయింది. ఆవిడ ప్రేమించిందీ, కాంక్షించిందీ తన్ని కాదా? తన రూపాన్ని కాదా? అంతసేపూ చూసింది - ఈ దిక్కుమాలిన బుష్‌కోట్‌నేనా?

సుబ్బారావు కోపంగా బుష్‌కోట్‌ను విప్పి కాలవలో పారేశాడు. ఆనాటినుంచి అతనెప్పుడూ బుష్‌కోటు తొడుక్కోలేదని తెలిసినవాళ్లు చెప్పుకుంటూంటారు!



# సేవింగ్సు ఎకౌంటు

'మన జీతాలు యిప్పుడప్పుడే వచ్చేటట్లు లేదు.' అన్నాడు భాస్కరం, తోటి గుమాస్తా శంకరంతో!

'అవును.. డిస్పాచింగు క్లర్కు సెలవు పెట్టాట్ట; సంతకాలు యెప్పుడో అయిపోయాయి; వాడి పని చూసేందు కెవరూ లేరుట.' అన్నాడు శంకరం.

'డిస్పాచింగుక్లర్కు కోసమని, నెలమీద పదిరోజు లయినా మనం అగచాట్లు పడవలసిందే నన్నమాట. ఏం బాగుందోయ్!' అన్నాడు భాస్కరం!

"ఏం చేస్తాం...ఎదురుమాడ్డంకంటే' - అన్నాడు శంకరం!

'అంతేలే!' - భాస్కరం అని, ఒక నిముషం ఆగి; 'డబ్బు చాలా యిబ్బందిగా వుందోయ్!' - అన్నాడు!

'అవునోయ్! నాకూ చాలా అవసరంగా వుంది!'

'నీకూ అవసరంగావుందా!' - ఆశ్చర్యంగా ప్రశ్నించాడు భాస్కరం...

"నేనుమాత్రం మనిషిని కానేమిటి... మీ అందరి అవసరాలంటవే నాకూ వుంటాయిగా" - అని నవ్వాడు శంకరం.

'అది కాదోయ్, ' - ఏమో చెప్పబోయాడు భాస్కరం!

'ఏమిటి కాదు.. నీకు మల్లేనే - అయిదు రోజులబట్టీ నేనూ జీతంకోసం యెదురు చూస్తున్నాను; వైదీకివి కాబట్టి నువ్వు తేలిపోయావు, నేను నియోగిని కాబట్టి తేలకండా దాచకలిగాను' - అన్నాడు శంకరం నవ్వుతూ!

'ఈమాత్రందానికి వైదీకీ, నియోగీ యెందుకోయ్' - అన్నాడు భాస్కరం!

శంకరం తిరిగి నవ్వాడు; భాస్కరం ఒక నిముషం ఆగి అన్నాడు; 'నీకూ డబ్బు యిబ్బందిగా వున్నదన్నమాట' అని.

'అంటే?' - యెగా దిగా భాస్కరం వంక చూశాడు శంకరం.

'నీకు సేవింగ్సు ఎకౌంటు వుంది కాదోయ్'

'ఉంటే?'__

'అవసరం అయితే తీసుకుంటూండ వచ్చుగా!' తన వుద్దేశాన్ని వ్యక్తపర్చటం కోసం, ఆలోచించి అన్నాడు భాస్కరం!

'తీసుకోటమా!' - ఆశ్చర్యం వెలిబుచ్చుతూ అన్నాడు శంకరం.

'ఊ..'

'మనం సేవింగ్సులో వేయటమే గాని, తీయటం అనేది లేదు, జీతం రావటంతోటే పదో, అయిదో దాంట్లో పడేస్తున్నాను'-

'పడేస్తున్నవాడివ్ తీస్తేనేం? - అమాయకంగా ప్రశ్నించాడు భాస్కరం!

'తీసుకుంటే మరి ఎకౌంటు వుంచటమే జరగదు'

'అంటే.'

'వేస్తే వేయటమే; తీస్తే తీయటమే... అని నవ్వాడు శంకరం!

'నీమాటలు నాకు బోధపడటంలేదు'__

ఓగేటి శివరామకృష్ణ

'అదృ తెలుసులోనే, నే మాట్లాడుతున్నాను సేవింగ్సులోంచి డబ్బుతీయటం ప్రారంభించితే, మరి వున్నదంతా పూర్తిగా తీసివేయటం జరుగుతుంది కాని మరి వేయటం జరగదు, అందువల్ల వేస్తే వేయటమే గాని, తీయటంమాత్రం నే జరపటం లేదు' - అన్నాడు శంకరం!

'నీమాటలు బహువిచిత్రంగావున్నాయ్!'- అన్నాడు భాస్కరం!

'ఆశ్చర్యపడ నవసరంలేదు, అది అనుభవంమీదగాని తెలియదు' - అన్నాడు. అనుభవజ్ఞునిఫండిగా పోజుపెట్టి శంకరం..

భాస్కరం ఉస్సురనుకొన్నాడు, తాను ఒక నిర్ణయం చేసుకొని, శంకరంతో సంభాషణ కుపక్రమించాడు, శంకరం ఆ నిర్ణయానికి కట్టుపడాల్సిన అవసరమే లేకపోయింది

కొంచెంసేపు యోచించి. భాస్కరం ఒక చిరునవ్వు నవ్వి అన్నాడు 'ఇంతకీ నువ్వు సేవింగ్సులోంచి డబ్బు తీయనంటావ్ -'

'ఊ..'

'ఇంతవరకూ యెప్పుడూ తీయ లేదా?'

'లేదు!'

'అదృష్టవంతుడవ్!'

'అదృష్టాని కేముంది. దానికి పట్టుదలే ప్రధానం. పట్టు పెట్టుకుంటే సరి -'

'సరే లేగాని. నాకోసం యిప్పుడు నువ్వు తియ్యాటం తప్పదు -'

భాస్కరం, శంకరంముఖంలోకి చూస్తూ అన్నాడు...

'ఏమిటీ!' - ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు శంకరం!

'నాకు డబ్బు అవుసరంగా వుంది. జీతంలో యిస్తాను ఒక పదిరూపాయలు సర్దుబాటు చేయాలి!'

'నాదగ్గర లేదు' - అన్నాడు ఇంతవరకు జరిగిన సంభాషణ అంతా మరచినవాడి విధంగా శంకరం!

'నీదగ్గర లేదన్న సంగతి నాకూ తెలుసు;'

'మరి' -

'నీ ఎకౌంటులోంచి తీసి యివ్వమంటున్నాను' -

'అమ్మబాబో'

'ఏం' -

'ఎకౌంటులోంచితీస్తే తీయటమే అవుతుందిగాని వేయటం జరగదని నీతో చెప్పలేదూ!'

'చెప్పావనుకో -'

'మరి యేలా తీస్తాననుకున్నావ్!'

'నీకోసం తీయటం లేదుగా నాకోసం తీస్తున్నావ్' -

'ఎవరికోసమయినా సరే.. దాంట్లోంచి డబ్బు తీయదల్చ లేదు'

'ఏం' -

'తీస్తే.. తీయటమే .. తిరిగివేయటం జరగదు!

'ఓరి పిచ్చాడా! నాకిచ్చే పదిరూపాయలూ, జీతాలు అందటంతోటే యిచ్చేస్తానంటున్నానుగా!'

'ఏమయినాసరే. తీయను' -

'పోనీ నువ్వు తీసుకోటం వానేయి! నాకు యిచ్చిన పది - జీతం రావటంతోటే వెంటనే కట్టేద్దువుగాని' -

'ఊహూ'

'పెద్ద నియోగినంటావ్ ... నీకు తెలివితేటలు యెక్కడయేడిశాయ్. పోనీ దానిమీద వడ్డీ కావలసివస్తే చెప్తా యిస్తాను' అన్నాడు భాస్కరం నవ్వి!

'హడ్డీకాదు గిడ్డీకాదు; నాదగ్గరవుంటే, నీకు తప్పక సర్దియుండేవాడ్ని!'

'బ్యాంకులో పడివుండగా లేదంటా వేమిటోయ్!'

'అది మనసొమ్ము కాదనుకోవాలి! మన సొమ్మని అనుకుంటే నిర్వాకం చేసినట్లే' -

'సరేగాని... నాకు చాలా అవసరం... తప్పదు' - అన్నాడు భాస్కరం!

'ఏం చేయమంటావ్'— తీవ్రంగా చూశాడు శంకరం!

'నాకు పది రూపాయలూ తీసిపెట్టు!'

'నావల్ల కాదు!'

'నే డబ్బుకోసం చాలా బాధపడుతున్నా!'

'నేనూ పడుతున్నా'—అన్నాడు శంకరం!

'అందుకనే తీయమంటున్నా; జీతం చేతిలో పడటంతోటే, నీ కిచ్చివేస్తా!' - అన్నాడు భాస్కరం!

'అదే వల్ల కాదంటున్నా' అన్నాడు దృఢ నిశ్చయంతో శంకరం!

'అవసరానికి వుపయోగించుకోని... మరి ఆ వెధవ డబ్బు యెందుకూ?'—అన్నాడు కోపంతో భాస్కరం!

'అవసరానికి వుపయోగించుకోటానికి కాదు... అంతే...' అన్నాడు శంకరం!

భాస్కరానికి బాగా కోపం వచ్చేసింది. తీవ్ర స్వరంలో అన్నాడు అతను: 'ఏం శంకరం! ఇస్తావా? ఇయ్యవా?

'నాదగ్గర లేదు; సేవింగ్సులోంచి, తీసి యివ్వ వీలుపడదు.'

'అంతేనా?'

'అంతే!'

'నీ ముష్టి డబ్బు యెవడి క్కావాలి?' - అని భాస్కరం - తనచోటులోకి పోయి కూర్చుని, తీవ్రంగా ఒకమారు శంకరం వయిపు చూచి, పని చూసుకోసాగాడు!

'అంత వుక్రోషం పనికిరాదు!'— అన్నాడు తనచోటులో కూర్చుని శంకరం!

'ఏడిశావు లేవోయ్!'—అన్నాడు భాస్కరం!

'అంతా అనుభవం వుంటే తెలుస్తుంది - పైపై మాటలతో ప్రయోజనం లేదు' - అన్నాడు శంకరం!

'చాల్లే. కట్టిపెట్టు' - అన్నాడు, పని చేసుకుంటూ భాస్కరం. శంకరం దేన్ని గురించో ఆలోచించసాగాడు...

అది ఆ దినం మధ్యాహ్నం ఆఫీసులో జరిగిన రభస.

* * *

మర్నాడే జీతాలు అందాయి: అందువల్ల శంకరం, భాస్కరంల సమస్యలు వెంటనే పరిష్కారమయిపోయాయి...... శంకరం యధాప్రకారం సేవింగ్సులో పది రూపాయలు పడేయటం, భాస్కరం స్వయంగా చూశాడు.

శంకరం సేవింగ్సు ఎకౌంటులోంచి, తీయటానికి వీల్లేదన్నప్పటినుంచీ, భాస్కరం దాన్ని గురించే ఆలోచించసాగాడు; తాను క్రితం దినం - ఒక్క పది రూపాయలు లేక ఎంత యిబ్బంది పడ్డాడు? ప్రతీ నెలలోనూ, చివరి రోజుల్లో డబ్బుకు దేవుళ్ళాడటం, వాళ్ళనూ వీళ్ళనూ అడగటం తప్పటంలేదు; అందువల్ల, అయిన ఖర్చుల్లో దీన్ని గూడా ఒకటిగా జమ చేసి ఓ పది రూపాయలు సేవింగ్సు ఎకౌంట్లో పడేస్తూంటే... క్రిందటి దినం వచ్చిన అవసరంలాంటి సమయాల్లో కలిసివస్తూంటాయి; అవసరమయితే—దాన్ని తీసుకుంటూండవచ్చు; లేకుంటే ఆ డబ్బు నిలవవుంటుంటుంది. ఇంచుమించుగా పది రోజుల



# సేవింగ్సు ఎకౌంటు

కొకమారు తనభార్య లక్ష్మి వేధించుతూనే వుంటుంది.....డబ్బు నిలవవేసి, తనకేమయినా, వస్తువు చేయించి పెట్టమని;— ఆమె సంభాషణ అంతటితో ముగియదు: "ఏదో ఆదాయం వస్తున్నదని, ఒళ్ళు పై తెలియకుండా ఆదాయానికి మించిన ఖర్చు చేసుకుంటూంటే యేలాగ? వచ్చే ఆదాయంలో నెలకో పది రూపాయలయినా నిలవ వేసుకోగలిగితే—అదే కొంత కాలానికి కొన్ని వందలవుతుంది...దానితో నగా నట్రా గాని, మరేమయినా చేయచ్చు..." అని అంటూంటుంది. భాస్కరం భార్య అనే మాటలను గురించి, యిదివర కెప్పుడూ అంత తీవ్రంగా యోచించింది లేదు. కాని క్రితం దినం శంకరం అన్న మాటలు అతడికి గుణపాఠం నేర్పాయి...దూరదృష్టితో ఆలోచించి, అయిన ఖర్చులలో యిదొకటిగా తలబోసి సేవింగ్సు ఎకౌంటు యేర్పాటు చేయ నిర్ణయించుకొన్నాడతను.

*　　*　　*

భాస్కరం పది రూపాయలు సేవింగ్సులో పడేశాడు...పడేసిన వారం రోజులకు, పోస్టుమ్యాను, ఆఫీసుకొచ్చి, అతడికి పాసు బుక్కు యిచ్చాడు...

శంకరం యిది చూచి తెల్లముఖం వేశాడు;

'నేనూ సేవింగ్సు ఎకౌంటు ఓపెన్ చేశాను!' – అన్నాడు తోటి గుమాస్తాల వయిపు చూస్తూ భాస్కరం!

'బాగుంది!' – అని అభినందించారు ఒకరిద్దరు గుమాస్తాలు...

'కొన్ని ముఖాలున్నాయి చూశారూ! దగ్గర డబ్బున్నప్పటికీ, డబ్బు లేనట్లుగా యేడుస్తారు; వాళ్ళు కడుపునిండా తినరు; ఒకళ్లకు పెట్టలేరు!' – అన్నాడు భాస్కరం!

'లోకంలో నూటికి డెబ్భై అయిదు వంతులు అట్టివాళ్లే!' అన్నాడొక గుమస్తా!

శంకరం ముఖం చిటచిట లాడించాడు:

'దగ్గర డబ్బున్నా లేనట్లుగా యేడుస్తారు; సేవింగ్సులో డబ్బు మూలుగుతూంటుంది; ఆడబ్బుతీసి ఖర్చుపెట్టడానికి ఈదరిద్రులకు మనస్కొప్పదు; ప్రాణానికీ డబ్బుకూ లంకెవాళ్లకి...అవసర సమయం, వుపయోగించుకోనేందుకు గదా, దాచుకోనేది... కాని...యీ డబ్బుకూ, ప్రాణానికీ లంకెగా, గల మనుష్యులు – ఎన్ని అవసరాలు వచ్చినా ఆ డబ్బుసంగతి యెత్తరు... చచ్చిపోనయినా చచ్చిపోతారుగాని... వాళ్లు తీసి ఉపయోగించుకోరు; పోనీ అవసర సమయంలో యితరులకయినా సహాయం చేయరు!' – భాస్కరం యీ విధంగా వుద్రేకంతో యేమేమో అనేశాడు.

'అందరూ నీలాంటివాళ్లు వుంటారు టోయ్!' – అన్నాడొక గుమాస్తా!

శంకరం యింక వూరుకోలేకపోయాడు: 'ఏ విధమైన కబుర్లు అనేకం చెప్పవచ్చు; దేనికయినా అనుభవం వుండాలి!' – అన్నాడు!

'అంటే' – మరో గుమాస్తా, శంకరాన్ని ప్రశ్నించాడు!

'నేను సేవింగ్సులోంచి డబ్బుతీసి యివ్వలేదనేగా, అలా, భాస్కరం యేడ్చేది... తానూ ఒక ఎకౌంటు యేర్పాటు చేశాడు గనుక ముందుముందు, తెలుస్తుంది' – అన్నాడు శంకరం!

'చూదాం!' – అన్నాడు భాస్కరం!

'ఈ కంటికీ రెప్పలు దూరంకావుగా!' అన్నాడు శంకరం!...

భాస్కరం మాత్రం శంకరంవయిపు చూశాడు...

ఇంతట్లో ఆఫీసరు రావటంవల్ల సంభాషణ ఆగిపోయింది.

*　　*　　*

కొన్ని నెలలు గడిచాయి...జీతాలు సక్రమంగా వస్తూనే వున్నాయి; శంకరం, శంకరంతోబాటు భాస్కరం పట్టుదలగా ప్రతీ నెలా సేవింగ్సులో పడేసి రూపాయలు నిలవ వేస్తూనే వున్నారు. అయితే యిక్కడ ఒక చిన్న విషయం...శంకరం బహు జాగ్రత్త మనిషి అవటంవల్ల, వచ్చే జీతాన్ని పొదుపుగా వాడుకుంటూ, పది రూపాయలు నిలవ వేసుకో కలుగుతున్నాడు. కాని భాస్కరంపరిస్థితి అలా లేదు; చూడటానికి పదిరూపాయల నిలవ కనపడుతున్నా యిరవై రూపాయల అప్పు, అతడ్ని ప్రతీనెలా వెంటాడుతూనే వుంది...

భాస్కరం ప్రతీనెలా కలసి వస్తున్న అప్పునుగురించి హెచ్చుగా తర్కించలేదు. అతడు పడేసంతృప్తి ఒక్కటి – ప్రతీనెలా పదిరూపాయలు నిలవ వేయటం గురించి; తానూ శంకరం విధంగా ఎకౌంటు నడుపుతున్నందుకు, అతడు పొందిన ఆనందం యింతా అంతా గాదు; కొత్తగా అతడిలో గర్వంకూడా మొలకెత్తింది; ఈవిధంగా రోజులు గడిచాయి.

ఇప్పుడు సేవింగ్సులో భాస్కరం – వందరూపాయలు నిలవ వేశాడు; అయితే అతడివ్వవలసిన బాకీలు సుమారు రెండు వందలయేభై వున్నాయనుకోండి; వాటి సంగతి అతడు ఆలోచించటంలేదు; ఆలోచించేది వంద రూపాయల నిలవగురించే..

*　　*　　*

ఆ నెలజీతాలు రావని ఆఫీసులో తెలిసింది ... గవర్నమెంటు తిరిగి గ్రాంటు మంజూరుచేసేదాకా డబ్బురాదట ... అది మరి, యిరవై, యిరవై అయిదురోజులు పడుతుంది. గుమాస్తాలంతా తెల్లముఖాలు వేశారు.

మేకపోతుగాంభీర్యం తొణికిసలాడించాడు భాస్కరంమాత్రం...

శంకరంముఖంలో చిరునవ్వు చిందులాడింది...

మిగిలిన గుమాస్తాలు, వీళ్ళిద్దరినీ ఆశ్రయించి, పదో పరకో అప్పు పుచ్చుకొందామనుకొన్నారు. ఇదివరలో భాస్కరం

అన్నమాటల పురస్కరించుని, తప్పక, యిస్తాడనే వుద్దేశంతో అతడ్నే వాళ్లడిగారు.
భాస్కరం తికమకపడుతూ 'యేమిటీ' - అన్నాడు!

'అప్పుపెట్టవయ్యా! ఇద్దరకూ ... చెరి పాతిక్కా ... రేపు జీతాలు వచ్చినతర్వాత తీసుకుందువుగాని' - అన్నాడొకగుమాస్తా!
తనసీటులోకూర్చుని, పనిచేసుకుంటున్న

శంకరం, పని, ఆపి...భాస్కరంవేపు తలయెత్తి చూడసాగాడు!
'అంటే!'
'అప్పు' - వాళ్లజవాబది!

# సేవింగ్స్ ఎకౌంట్లు

'నాదగ్గ రెక్కడుంది!' - పూర్వం శంకరం తనతో అన్నట్లుగానే, భాస్కరం యిప్పుడు వాళ్లతో అన్నాడు...

ఇద్దరు గుమాస్తాలు ఆశ్చర్యపోయారు; శంకరం అదోవిధంగా భాస్కరంవయిపు చూశాడు;

'సేవింగ్సులో వున్నది కాదుటయ్యా!'

'ఊఁ...' - అన్నాడు తెల్లబోతూ భాస్కరం!

'అందులోంచితీసిఇయ్యి...జీతం వచ్చిన తర్వాత, యిస్తాం...తిరిగి పడేద్దువుగాని!'

'అమ్మ బాబోయ్! అందులోంచి డబ్బు తీయటమే' - గతంలో అన్న మాటలు మరచి అన్నాడు భాస్కరం!

'ఏం?'

'అందులోంచిడబ్బుతీస్తే...తిరిగి వేయటం జరగదు. నేనూ మీతో పాటు కష్టపడుతున్నా; కాని, నాకు దాంట్లోంచి డబ్బు తీయ బుద్ధిపుట్టటం లేదు' - అన్నాడు భాస్కరం!

'అప్పుడేవో...గొప్పగాకబుర్లుచెప్పావే!'

'ఆ...అప్పుడేదో అన్నానంతే!'

'ఎంతివాడవోయ్ భాస్కరం!'

'ఎవరయినా ... అంతే ... పై కబుర్లు చాలా చెబుతారు! తనదగ్గరకు వచ్చేటప్పటికిమాత్రం తోకముడుస్తారు!' - అన్నాడు రెండో గుమాస్తా!

శంకరం - భాస్కరం వయిపు చూస్తూ నవ్వాడు:

'అంతేనా!' అన్నాడు మొదటిగుమాస్తా!

'అంతే'—అన్నాడు భాస్కరం.

'బలే మగాడివి. ఈలా సమయానుకూలంగా మాటాడే మనిషి వనుకోలేదు' అని, గుమాస్తాలిద్దరూ శంకరం దగ్గరకు వెళ్లారు.

శంకరంతో కలసి ముగ్గురూ ఒక్కపెట్టున నవ్వారు.

'ఏదో యింతకాలం భాస్కరాన్ని పైడు చేశాం; కాని అత డింత కుళ్ళుబుద్ధి కలవాడనుకోలేదు'—అన్నారా యిద్దరు గుమాస్తాలు.

శంకరం తిరిగి నవ్వి వూరుకొన్నాడు.

'నువ్వయినా యీసమయంలో సహాయపడాలి!'

'నేనా!'

'ఊఁ'

'నాదగ్గర యేం లేదు; ఎకౌంటునుంచి తీయటం అసాధ్యం!'

'జీతం వచ్చిన తర్వాత తిరిగి అందులో పడేద్దువు గాని లేవయ్యా!'

'ఏమయినా సరే... నే తీసియివ్వను. నే యెప్పుడూ ఒకమాటమీద నిలబడి వుండే వాడ్ని!'—అన్నాడు శంకరం!

'నీకూ డబ్బుకూ లంకె; అంత డబ్బుకూ, ప్రాణానికీ లంకె అయితే యెల్లాగ? అవసరమయినప్పు డుపయోగించుకుందుకు గదా డబ్బు నిలవ వేసుకోటం' అన్నారిద్దరు గుమాస్తాలూ.

'డబ్బు! సేవింగ్సులో దాచుకొనే ఆ డబ్బు విలువ మీకేం తెలుస్తుంది......' అన్నాడు భాస్కరం!

'ఆ...అంతే!'—అన్నాడు శంకరం!

గుమాస్తాలిద్దరూ నిర్ఘాంతపోయారు.

ఒకప్పు డొకళ్లనొకళ్లు దూషించుకొన్న శంకరం, భాస్కరం తిరిగి మాటాడుకోడం ప్రారంభించారు. శంకరం అభిప్రాయాలు, పూర్తిగా భాస్కరంలో కలసిపోయాయి.

కొన్ని రోజులు గడిచాయి; డబ్బు దాచుకొన్న శంకరం, భాస్కరంలు తమతోపాటు బాధపడటం—తోటివాళ్లకు ఆశ్చర్యకరంగానూ, బాధాకరంగానూ వుంది. అయితే వాళ్లేం చేస్తారు...

* * *

హఠాత్తుగా శంకరం భార్యకు జబ్బు చేసింది...

చేత డబ్బు, వెనక దిక్కూలేని శంకరం, ఆమెను హాస్పటల్లో చేర్పించాడు; చేర్పించినప్పటినుంచి, వైద్యానికి డబ్బు అవసరమైంది...సేవింగ్సులో వుంచిన డబ్బు శంకరానికి తీయటం తప్పనిసరియైంది.

ఆ డబ్బు ఖర్చుతో—భార్య ఆరోగ్యం తిన్నబడింది...ఖర్చయిన డబ్బుకు శంకరం దిగులొందినా, భార్య బ్రతికినందు కెంతో సంతోషించాడు; బ్రతికివుంటే బలుసాకు కూర తినవచ్చుననే తలంపుకొచ్చా డతను.

భార్యను, హాస్పటలునుంచి విడుదల చేస్తూ డబ్భైరూపాయల బిల్లు, శంకరం చేతిలో పెట్టాడు డాక్టరు.

మరి పది, పదిహేను రోజుల్లో యివ్వగలనన్నాడు శంకరం!

'వైద్యం చేయించుకోటానికి డబ్బు

దొరికినప్పుడు, నా కివ్వటానికి మీకు దొర కదూ?'—అని నిష్ఠూరంగా పలికాడు డాక్టరు!

శంకరంకు తల కొట్టేశినట్లయింది...

ఏవిధంగా నయినాసరే డబ్బు ప్రయత్నించి, తెచ్చియిద్దా మనుకొన్నాడతను.

అనేక విధాలుగా ప్రయత్నించాడు శంకరం...

అతడి ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి...

చిట్టచివరకు—తోటి గుమాస్తా స్నేహితుల్ని సహితం, తనకు డబ్భై రూపాయలు చూసిపెట్టమని, జీతం వచ్చినతర్వాత సర్దుబాటు చేస్తాననీ చెప్పాడు...

వాళ్లు సహితం 'మాకెక్కడ దొరకుతుంది!' - అని వూరుకొన్నారు...చిట్టచివరకు ఆలోచించిన మీదట—శంకరంకు భాస్కరం గుర్తొచ్చాడు.

అతడు మరి చేసేదిలేక నేరుగా భాస్కరం దగ్గరకు వెళ్లాడు. దిగాలుగా, యింట్లో కూర్చునివున్నాడు భాస్కరం.

'భాస్కరం! ఇప్పుడు నువ్వే నాకు దిక్కు!' - అని కాళ్ళమీద పడ్డాడు శంకరం!

'ఏమిటిది?' - ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు భాస్కరం.

'నా గౌరవం కాపాడుకోవటానికి... నువ్వే నా కాధారం!'

'అంటే'—

'ఒకప్పుడు...నువ్వు సేవింగ్సులోంచి డబ్బుతీసియివ్వమని అడిగావ్ ... జ్ఞాపకం వుందా! నేను లేదన్నాను..నీ అవసరాన్ని గుర్తించలేక; అనుభవంవల్ల నాకు తెలుస్తోంది...నన్ను క్షమించి - నా కిప్పుడు నువ్వు సహాయపడాలి!'-అన్నాడు శంకరం.

'నీమాటలు నా కర్థమవటం లేదు!' - అన్నాడు భాస్కరం.

'నే నిలవవేసిన మొత్తం ఖర్చయిపోయింది. నా భార్య బ్రతికి బయటపడింది. డాక్టరు తన డబ్బు వెంటనే యివ్వాలన్నాడు—నాకు దారియేం తోచడంలేదు' - అని అన్నాడు శంకరం!

'అలాగా!' - అన్నాడు భాస్కరం.

'ఇప్పుడొక డబ్భైరూపాయలు తీసి నాకియ్యి; నాకు జీతం అందటంతోటే ఇచ్చేస్తాను!' అన్నాడు శంకరం.

'నాదగ్గర డబ్బు యెక్కడ వుంది?'—దీనంగా ముఖంపెట్టి అన్నాడు భాస్కరం.

'సేవింగ్సులో నీపేర డబ్బునిలవ లేదూ?'

'లేదు'—అన్నాడు దిగాలుగా భాస్కరం!

'ఏమయింది?' ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శంకరం.

'ఇంతక్రితమే షాహుకారు వెంకయ్య తీసుకుపోయాడు!'

'అదేమిటి!'

'ఏముంది! గత ఆరు మాసాలనుంచీ అతని కొట్లో, జమకట్టడం మానేశాను; మళ్ళా నెలలో యిస్తానని జరుపుకొస్తున్నాను...తొంభై రూపాయలవరకూ బాకీ తేలింది. పది రోజులనుంచి వెంకయ్య తెగ తిరగసాగాడు. 'జీతం వచ్చేవరకూ ఆగవయ్యా' అన్నాను. 'ఉహూ'—ఈ దినం యివ్వక పోతే—దావా చేయటానికి కోర్టుకు వెడతా నన్నాడు. చేసేదిలేక నిలవవేసిన డబ్బు యీ దినమే, యింత క్రితమే తెచ్చియిచ్చాను ... సేవింగ్సు బ్యాంకులో నా నిలవ మరేముంది?' - అన్నాడు కన్నీళ్లు పెట్టుకొని భాస్కరం!

'నీ బ్రతుకూ యిలాగయిందా!' - అని చతికిల బడిపోయాడు శంకరం.'

★




ఇది యీనాటి విషయం కాదు. అంటే మా నాయనమ్మ పెళ్ళినాటి దనుకోబోయేరు. అదీకాదు. ఓ నాలుగేళ్ళనాటి విషయం. అప్పటికి నేనూ ఓ విద్యార్థినే. పల్లెటూరినుండి బి. ఏ. అనర్సు పూర్తిచేయడానికి పట్టణంవచ్చిన విద్యార్థిని. అప్పటికీ యిప్పటికీ పట్నంలో అద్దె యిల్లు సంపాయించేవాడు, కొత్త చిత్రం విడుదలయిన రోజున టిక్కెట్టు సంపాయించేవాడూ, ఘటికుడే అనిపించుకుంటున్నారు. పట్టణంలో అద్దెకు ఓ కొంప సంపాయించాలంటే యెన్నో క్రెడెన్షియల్సు వుండాలి. మొట్టమొదట అతను సంసారిఅయి వుండాలి. ఒకరిద్దరు పిల్లలుంటే అది ఎక్స్ట్రా క్వాలిఫికేషను అవుతుంది. దానికితోడు ముసలాళ్ళెవరయినావుంటే ప్రిఫరెన్సు దొరుకుతుంది. ఇలాంటి నియమాలను యింటి యజమానులెందుకు పెడతారో అందలి మంచి చెడ్డ లేమిటో నేను విప్పిచెప్ప నవసరంలేదు. ఇంతకూ నావాదం యేమంటే పెళ్ళాం పిల్లలతో కాపురంచేసేవారు అందరూ బుద్ధిమంతులు కారు. అలాగే బ్రహ్మచారులుగా వుండేవారందరూ లుచ్ఛాలు కారు. అసలు విద్యార్థులను, బ్రహ్మచారులను - అంటే పెళ్లయినా కాకపోయినా ప్రస్తుతానికి ఒంటరిగా జీవితం గడిపే యువకులను - (ఇప్పుడు 'బ్రహ్మచారి' అన్న పదం యెక్కువగా యీ అర్థంతోనే వాడబడుతున్నదని నాభావం) - చెడుగా భావించటం పొరపాటంటాను. అందులో ముఖ్యంగా తలలు నెరసినవారు కాలేజివిద్యార్థులంటే ఎందుకో యెగిరిపడతారు. కాలేజీ స్టూడెంటనగానే వాడికి "పోకిరీగాడు" అన్న లేబిల్ తగిలించి వదలిపెడతారు. నేనెవరిపైకీ దండయాత్రకు బయలుదేరటంలేదు. కేవలం మాటవరసకు చెప్పుకొస్తున్నాను.

పట్టణం వచ్చిరావడంతో మూడునెల్లు మాకుటుంబంతో సన్నిహితసంబంధంవున్న ఓ పెద్దమనిషి యింటిలో మకాం వేశాను. హోటల్లోవుంటూ చదువుకోడం కానిపని. ఇక హాస్టలులో వుండాలి. అప్పటికీ ఇప్పటికీ హాస్టళ్ళవిషయంలో నా అభిప్రాయం వేరు. నా కెందుకో హాస్టళ్ళలో వుంటే వచ్చే లాభం, మంచికంటే, చెడుగూ, నష్టమే అధికంగానే వుంటుం దనిపిస్తుంది. అయినా అదేదో తేల్చుకోడానికి నేను హాస్టలు జీవితంగడపలేదు. ఇప్పటికీ నాఅనుమానం అభిప్రాయం అలాగే వుంది. మూడు నెల్లు ఆ పెద్దమనిషియింటిలోవుండి పట్టణ పరిస్థితులనూ, ఆయన సహచర్యంతో పట్టణంలో యేయే విషయాలలో జాగ్రత్తగా వుండాలో, యేయే ప్రదేశాలలో యేవిధంగా మెలగాలో, యేయే అవసరాలకి యెక్కడికెళ్ళాలో యిత్యాదివిషయాలను గ్రహించుకున్నాను. ఇక అధికంగా ఆయనయింటిలో వుంటూ అతన్ని టాక్సు చేయదల్చుకోలేదు. 'ఏదయినా' ఓగది అద్దె కిప్పించమని చెప్పాను.

బొమ్మిరెడ్డి

అతడిస్నేహితుడియింటిలో ఖాళీవుంటే వెళ్ళాంచూడ్డానికి. వుండేవాడిని నేనొక్కడినేకాబట్టి ఆ చిన్నగది, దానినంటుకొనే వున్న అంతకంటే చిన్నదయినవంటయిల్లూ నాకు మస్తు మస్తు. ఇంటి అద్దె పదిహేనయినా చప్పున వొప్పుకున్నాను. అప్పటికప్పుడే పర్సుతీసి ఓ ఎర్రకాగితమూ, పచ్చకాగితమూ జతచేసి యిచ్చాను అడ్వాన్సుగా. గదితాళం చేవి నాచేతి కొచ్చింది.

మరునాడు నా బస అద్దెయింటికి మార్చడానికి సిద్ధమై కూర్చున్నాను. ఇంతలో యింటి యజమాని ఆత్రంగా వచ్చాడు. వచ్చిన సంగతి బయటపెట్టాడు. పక్కింటి వాటాదారు నా విషయంలో అభ్యంతరం చెప్పాడు. భార్యాపిల్లలతో కాపురం చేస్తున్న అతనికి పక్కగా నాలాంటి వంటరిగాడు, అందులో విద్యార్థి - బ్రహ్మచారి - వుండటం క్షేమమూ, శ్రేయస్కరమూ కాదట. నే నతనియింటి పక్కన వుండటం అతనికి సుతారమూ యిష్టంలేదు. అలా నేదయినా జరిగితే తాను తప్పనిసరిగా యిల్లు మార్చవలసి వస్తుందని గట్టిగా మరిమరీ చెప్పాడట. ఇంతకూ నన్ను సుంద్రావుగారు సిఫారసుచేశారు గనుక 'నీకో వాటా యివ్వడానికి వీలులేదబ్బాయ్' అని గట్టిగా చెప్పలేకపోతున్నాడు. నాకు నవ్వు ముంచుకొచ్చింది.

"మీరా గదిని అద్దెకివ్వడానికే అలా వుంచారనుకుంటాను" అన్నాను కోపంగా.

'అవును' అని వొప్పుకుంటున్నట్లు తలాడించాడు.

ఆ వొక్క గదిలో యిద్దరు ముగ్గురు పిల్లలు గలవాడి విషయ మటుంచి కనీసం భార్యాభర్త లిద్దరయినా కాపురం చేయగలరా అని అడుగుదామనుకొన్నాను. కాని అంతలోకే "అలా వుంటున్నవారు యెందరు లేరు" అని అత డివ్వగల జవాబు కొరడాదెబ్బలా స్ఫురించింది. ప్లేటు మార్చి అన్నాను" చూడండి అంత యిరుకుగదిలో హోటల్లో కుడిచి అరుగుపైన ముడుచుకునే నాలాంటివా డెవడైనా వుండగలడేమో కాని వంటా గింటా పెట్టుకొనే పెళ్లాం పిల్లలు కలవాడెవడూ వుండలేడు. స్నానానికయినా వంటింటిలో వున్న ఆ చిన్న మోరీతప్ప వేరు ఏర్పాటు లేదాయె. ఆడాళ్లెలా వుంటారండీ! మొగాళ్ళంటే ఏ పంపు కిందో, బావిదగ్గరో చేయగలరనుకోండి. పోనీ అదలా వుంచి యిన్ని అభ్యంతరాలు చెప్పే ఆ పెద్దమనిషే దాన్ని కూడా తన వాటాలో కలుపుకోమంటే యే పేచీ లేదుగా! ఆ మూసిన తలుపేనా అడ్డం. దాన్ని తెరిస్తే తీరిపోతుంది. పాపం రెండు గదుల్లో సతమత మౌతున్నట్టుంది." అని.

ఇంతలో సుంద్రావుగారు కల్పించుకొని నా బుద్ధి గుణవిశేషాలగురించి అరగంట చెప్పాడు. చివరికి స్నేహితుడన్న చనువుతో "ఏంటయ్యా నా మాటకైనా విలువ లేదా, మావా డెంత బుద్ధిమంతుడు కొంచెం యింట్లో యిద్దరు ఆడపిల్లలున్నా, మూడు నెల్లనుంచి వుంచుకుంటున్నా ననుకొంటావ్" అన్నారు.

నాతోటి కిరాయిదారు నా విషయంలో అభ్యంతరం తెలియచేశాడని తెలిసిన నాటి నుండీ అతనంటే నా మనస్సులో జుగుప్స బయలుదేరింది. చీటికి మాటికి అతనితో పేచీపడి యేడిపించాలనుకున్నాను. అయితే

నా ప్రవర్తన విషయంలో యిల్లుగల్లాయనకు పోవిగా వున్న సుందర్రావుగారి మాట దక్కించే బాధ్యత నాపైవుంది కనుక అలా చేయలేక పోయాను.

కాని గిరిధరరావుమీది నాకసి యెలా తీర్చుకోవాలా అన్న ఆలోచనమాత్రం మానలేదు. ఆయన నన్ను ఓవిచిత్రమైన జంతువును చూచినట్లు అనుమానంతో భయంతో చూస్తూవుంటాడు.

నేనంటే ఆయనకు యెలాగూ గిట్టదాయెను. నేను ఆయనపొరుగున వుండడం కంటకప్రాయంగా వుందాయె. ఇక నన్ను సాధించడం మొదలెట్టాడు. నాకు భావి దగ్గరవుండేపనల్లా పొద్దున ఓ పదినిమిషాల వరకే. అదీ స్నానంకోసం. నేను స్నానానికి బయలుదేరే వేళకు అతడేదో పని కల్పించుక కూర్చుంటా డక్కడ. భావిచుట్టూ యింటిలో వున్న బిందెలూ, బాల్చీలు తెచ్చి పెడతాడు. పదినిమషాల కోచేద తీస్తాడు. లేదా, వున్న యిద్దరిపిల్లల్ని అక్కడ కూర్చోబెట్టిస్నానం చేయిస్తూవుంటాడు. ఎలాగయితే నేమి నన్ను తొమ్మిదింటివరకూ నూతిదగ్గరకు రానివ్వకుండా వుంచేందుకు చేయవలసిన ప్రయత్నాలన్నీ చేస్తాడు. తొమ్మిదింటికల్లా నేను బస్సు చిక్కించుకోవాలని అతనికి బాగా తెలుసు.

ఒకటి రెండుసార్లు చొరవచేసుకొని నూతి దగ్గరనుండి తప్పుకోమని అడిగాను.

అప్పటినుండి ఓ కొత్త పంథా అనుసరించాడు. భావిదగ్గర మార్పుతీసుకవచ్చాడు. అతనికి బదులు ఆయన శ్రీమతిజీ అక్కడ వుండేది. భావిచుట్టూ అంటు గిన్నెలుంచి తోమడం మొదలెట్టేది. సరిగ్గా అక్కడే కూర్చుని అంట్లు తోముకుంటే అరగంటలో అవుతుంది. కాని అలా చేస్తేనా! గిన్నెలు భావిదగ్గిర, అమ్మగారు వంటింటిలో. పది నిమిషాల కోసారి వచ్చి అవసర మున్న పాత్రను రుద్ది కడుక్కొని తీసుకెళుతుంది. అపళంగా అంట్లుతోమడం పదింటివరకూ సాగుతుంది.

అందువల్ల స్నానమయినా చేయకుండా కాలేజీకి పోవలసి వచ్చేది.

ఎలాగో సర్దుకుపోతున్నాను. అయినా యింటి యజమానితో ఆయనగారు నావిషయంలో నిష్ఠూరంగా మాట్లాడడం నేను సహించలేక పోయాను. నా యింటిముందు వూడ్చి వార్చకపోతే ఆయన కేమి మునిగిందో నాకర్థం కాలేదు. వాకిలి ముందు ముగ్గు లేదట. గడపలకు పసుపు కుంకుమలు లేవట. ఇంటిముందు కళా: లేదట. ఆ దరిద్రం ఆయనకు చుట్టుకుంటుందట. ఏంచేయను? నేను బజారులో చీపురు పుచ్చుకొని ఎలా వూడ్చేది?? అయినా సర్దుకు పోవాలిగా!

నెలకో రూపాయిన్నరయిచ్చి ఆ పని పని మనిషిచేత చేయించ సాగాను. అయినా యేదో కొత్తరకం నేరం నాపై మోపడం జరుగుతూంది. కాని నేనుమాత్రం యెదురు తిరగకుండా సరిపెట్టుక పోతున్నాను.

గిరిధరరావు నన్నెంత సాధించినా ఓపిక

మా పాఠకులకు మరొక కొత్త ఆకర్షణ

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

## విక్టర్ హ్యూగో

## ప్రసిద్ధ నవల అనువాదం

ఫ్రెంచి నవలా రచయిత విక్టర్ హ్యూగో నవలల్లో ప్రసిద్ధమైన "హంచ్ బాక్ ఆఫ్ నాటర్ డామ్" (Hunchback of Notre Dame) నవల ఆంధ్రానువాదం 21-10-53 నుంచి మా వారపత్రికలో సీరియల్ గా ప్రచురింపబడనున్నదని తెలుపుటకు సంతసిస్తున్నాము. మా సీరియల్స్ అన్నిటినీ పాఠకులు ఆదరించినట్లే ఈ కొత్త సీరియల్ ను కూడా ఆదరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

సరే పక్కింటి కాపురస్తుడు ఆ రేడియోతోనే సరిపెట్టుకొని వుంటే బావుండును. పొద్దస్తమానం రేడియో వినివిని విసుగెత్తుతుందేమో యిక గ్రామఫోను లగాయిస్తారు. ఆ రికార్డులు కొత్తవయినా కావు. బి. సీ. నాటివిలా వున్నాయి. అయినా యిప్పటి సంగీత పోకడలకూ, పాతకాలపు సంగీత నడకలకూ వున్న తారతమ్యం - దానివల్ల ప్రజాభిరుచి యెలా మారుతుందో అన్న విషయమైనా తెలుసుకోడానికి వినవచ్చునంటే - ఆ రికార్డులు అసలు వినడానికి కర్ణకఠోరంగా వుంటాయి.

ఆ రికార్డులు పాతవని చెప్పాను గా. వాటిని ఆ రోజుల్లో కొన్నవే. వాటిని వాయించి వాయించి పూర్తిగా అరగదీశారు. కొన్ని దెబ్బతిని పెళుసులు లేచినవి. కొన్ని ఏ కారణం చేతనలో అష్టవక్రాలుగా మారాయి. అందువల్ల.

"ఫూలో ఫూ కస్ కస్ కసాకస్ తో[illegible] కటాకట్ చినపూసరి గరాగర"అని వినిపిస్తూ వుంటుంది. "పూలో పూలో తెలుగు తోటను పూచిన పూలో"అన్న పాట. ఇక యేలా వినడం చెప్పండి. నేనయితే వాటి నన్నింటినీ కుప్పగా పేర్చి వాటిపైన ఓ బండ వుంచి "పీస్ నివర్తి" అనుకొనేవాడిని. ఇక ఆ గ్రామఫోనయినా ఒక నియమంతో తిరిగేటట్టు లేదు. అందువల్ల రికార్డు ఒకొక్కొక్కప్పుడు తొందరగా, యింకొకప్పుడు మెల్లిగా తిరుగుతూ వుంటుంది. అందువల్ల వచ్చే ఆనందం నాకు బోధపడలేదు. బహుశా వాళ్లు ఎప్పుడు ఆనందంగా వుంటారేమో? అందువల్ల రోజు కొకసారయినా కొంత విచారించి యేడవకపోతే వాళ్ళ కానందంలోని మజా తగ్గుతుందని గ్రామఫోను పెట్టుకుంటూ రనుకునేవాడిని.

ఒకటి రెండుసార్లు గిరిధరరావుగారికి యీ విషయంలో గట్టిగా చెబుదామనుకున్నా. ఇతరుల విషయాలకు తను స్వాతంత్ర్యం అడ్డురాకూడదు అని నొక్కి చెప్పాలని అతని వాకిలి వరకూ వెళ్ళి తిరిగి వచ్చాను. నిషేధంవల్ల వుల్లంఘన, ప్రతి ఘటనలో పట్టింపు, అడ్డు పెట్టడంలో యెదురు తిరగడం వుంటాయని మనమందరం యెరిగిన సత్యమే. అందువల్ల అతనితో చెప్పకున్నా లాభం వుండదు. నా స్థితిని చూచి సానుభూతి చూపడం పైపెచ్చు నా కార్యాలకు భంగం కలిగించే విధానాలను యెక్కువ మోతాదులకు పెంచవచ్చును. అందువల్ల పరిస్థితి ముందటకన్నా అధ్వాన్నముగా మారగలదు కాని చక్కపడదు.

ఈ విషయాన్ని సంపత్రావుగారితో చెప్పి చూచాను. నా అభిప్రాయాన్నే పట్టాను ఎంతగా రాపాడినా సహించాను. కాని యీ పక్క విషయంలో నన్ను నేను తమాయించుకోలేకపోయాను. పగలు యింటిలో వుండను కాబట్టి వాళ్ళయింటిలో యెంతగోల జరిగినా నాకు పట్టదు. పోనీ వున్నా నాకు పట్టింపులేదు. కాని రాత్రిళ్లు పన్నెండింటివరకూ పక్కింటిలో గోలగా వుంటే యిక నా చదు వెలా సాగుతుంది?...

గిరిధరరావుకి రేడియో వొకటి వుంది దానికి తోడు గ్రామఫోను. ఆ రేడియో గ్రామఫోనులు రెండూ విధ్విరామం లేకుండా వొకట తప్పితే వొకటి రాత్రింబగళ్ళు వాగుతూనే వుంటాయి. రాత్రి తొమ్మిదింటికి రేడియో పలకడం మొదలెడుతుంది. బల్లముందు పుస్తకంతో కూర్చున్న నేను వార్తలయినా వినవచ్చునని వెనక్కి కుర్చీలో జేరపడతాను చదువుమాని ఖాళీగా. కాని రేడియో అంతటితో ఆగదు.

ప్రపంచంలో వున్న భాషలన్నింటిలో దాన్ని వాగిస్తాడు. మనకు తెలియని భాషలో సంగీతమో, నాటకమో వినిపిస్తూ వుంటే దానివల్ల వచ్చే ఆనందం యేమిటో గాని, నాకుమాత్రం చికాకెత్తేది. ఇక మద్రాసు నంచో, హైద్రాబాదు నుంచో తెనుగు సంగీతం వినిపిస్తూవుంటే కొంత వినబుద్ధవేసేది. అయినా చదువు పాడవుతుంది కదా అన్న దిగులు.

ఈ విధంగా రోజూ గడుస్తూ వుంటే యెలా ఓపిగ్గా వుండగలం. పక్కయింటిలో కాపురముంటూ పక్కవారి స్థితిగతులను ఆలోచించకుండా యిలా భావ్యమేనా! రాత్రి పది దాటింతరువాత యితరులకు భంగంకలిగించే విధంగా ప్రవర్తించకూడదు అన్న విషయం ఎప్పుడో చదివిన పౌరశాస్త్రంలో ఓమూల నున్నట్టు జ్ఞాపకం. రాత్రిళ్ళు రేడియో వగయిరాలను గోలగా పెట్టకూడదు అన్న నిషేధంకూడా వున్నట్లు జ్ఞాపకం. అయితే వాటి నెందరు పాటిస్తారు. పక్కవారి అవస్థలను యెందరు గుర్తిస్తారు.?

ఆయన బాధపడుతూ "లాభం వుండదు. ఎలాగో సర్దుకుపోవాలి అంతకూ ఆయనతో వేగలేకపోతే నా యింటిలో వచ్చివుండ రాదూ" అన్నారు.

"నా యింటిలో తాగి తందనాలాడుతారు. అడిగేవాడెవడంట? పొద్దస్తమానం ఆఫీసులో చచ్చి చెడి యింటికొచ్చి ఆ మాత్రం ఆనందంగా గడపకూడదా! ఆయన గారి పనుల కష్టం వచ్చే గోల నా యింటిలో జరుగుతూవుంటే చెవుల్లో దూది దోపుకో మనండి. రేడియో కొనుక్కున్న దెందుకండీ, విని ఆనందించడానికి కాదూ. సంగీతానికి చెవియొగ్గలేని వ్యక్తిని యే మాత్రం నమ్మకూడదని షేక్స్పియర్ మహా కవి వతిసే అనలేదు." అంటున్నాడు గిరిధరరావు ఇల్లుగల్లాయనతో నాకు వినిపించేలాగు.

"నీ స్వాతంత్ర్యాన్ని ఆనందాన్ని అరికట్టమని యెవరూ అనటంలేదు మహాశయా? కాని వాటిని యితరులకు అసౌకర్యం కలిగే స్థాయిలోకి పెంచకండి అని మాత్రమే నని బాబూ" అని అరవాలనుకున్నాను. కాని మర్యాద పెద్దమనిషి రాయబారం నడుపుతున్నప్పుడు అలా చేయటం సభ్యత కాదని వూరుకున్నా.

ఇంటి యజమాని మాటలను కూడా లెక్క చేయలేదతను.

నా స్థితి అలాగే వుంది. చదువు మూల పడ్డది. ఏవిధంగా యీయన్ని లొంగదీయడమా అని ఆలోచిస్తున్నా దివారాత్రాలు.

ప్రతి ఆది శనివారాలు పక్కింటిలో తెల్లవారేంతవరకూ గోలగా వుంటుంది. ఆ రెండు రోజులు, అతనూ అతనితోటి వుద్యోగస్తులూ కూడి విందు చేస్తూ వుంటారు. పాడుతూ వుంటారు. గాన పార్టీలు. ఇవతలవాడికి నిద్దర లేదు. చదువు ఆలోచనా సాగదు. యమకూపంలో పడ్డ వాడిలా బాధపడాల్సిందే.

వాళ్ళ చర్చలు అంతూ పంతూ లేకుండా సాగుతూ వుంటాయి. జాతీయ అంతర్జాతీయ విషయాల్లో నిపుణులు అయినట్లు చర్చిస్తూవుంటారు. మత, సాంఘిక ఆర్థిక విషయాలలో వాదించుకొంటారు. ఉద్రేకంతో పొంగుకుపోయే గొంతుకలతో వాళ్ళంత గట్టిగా చర్చించుకొంటూ వుంటే యివతలివాడికి చావాలనిపిస్తుంది. కాని యీ ప్రత్యేక సంఘటనలో యేమీ తెలియని మొద్దబ్బాయి అయితేనే అలా వుబలాటపడతాడు. వాళ్ళు చర్చించే విషయంలో యేమాత్రం ప్రవేశమున్నవాడూ వాళ్ళను వారించకపోడం అలా వుంచి చేతిలో తుపాకి వుంటే వాళ్ళను అవశ్యంగా కాల్చివేస్తానే అనుకొంటాడు.

మధ్యమధ్య వొకటి రెండు వాక్యాలు వాళ్ళ ఉపన్యాసాలలోనివి కోట్ చేస్తారు.

"శ్రీమతి సరోజినీదేవి తండ్రి మేజరు నాయుడు నిజాం కాలేజీని స్థాపించాడు." ఇంకో నయం. అఘోరనాథ చట్టోపాధ్యాయ ఆమె భర్త అని సూత్రీకరించినవారు కారు. ప్రస్తుత ప్రపంచచరిత్రలోనే వీరి తెలివి యిలాగుంటే యిక గత చరిత్ర నిర్ణయం యెలా చేస్తారో! మేజరు గోవిందరావు నాయుడు సరోజినీదేవి తండ్రి కాక భర్త అనీ ఆమెతండ్రి అఘోరనాథ చట్టోపాధ్యాయ అని తెలిసినవాడు వీరిని ఏమి చేయాలి? ఈ అవకతవక మాటలను యెలా సహించగలను. అలాంటివి యింకా ఎన్నో వున్నాయి. వాటిని యిక్కడ పొందుపరచడం కన్న మించిన అపచారం యింకొకటి వుండదు.

వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకొంటే యే గోలా వుండదు. కాని లౌడుస్పీకర్లలా వాగుతూవుంటే వినకుండా యెలా వుండగలను. విన్న తరువాత ఆ విషయంగురించి ఆలోచించకుండా వుండడం అసాధ్యం. ఇంకొక మహాశయుడు సరోజినికి "గీతాంజలి" వ్రాసినందుకు నోబెల్ ప్రైజు లభించింది" అంటాడు. నవ్వాలో యేడ్వాలో తోచదు.

ఆలోచించాను. ఏవిధంగా చేస్తే వీళ్ళు యిలాంటి విషయాలను గొడవగా మాట్లాడటం మానుతారా అని తలపోసాను. ఏం చేస్తే యీ గోల తప్పుతుందా అని మనన పడ్డాను. చివరికి వుపాయం తట్టింది.

పత్రిక వొకదాన్ని తీసి పఠనం మొదలెట్టాను పెద్దగా. అందువల్ల నా చదువుకు భంగం కలుగుతుందన్న విషయాన్ని వాళ్లు గుర్తించి నెమ్మదిస్తారన్న ఆశతో. ఆశ ఫలించింది. కొంత నెమ్మదించినట్లుంది.

అయిదు నిముషాలు గడిచింది.

"గొడవగా మాట్లాడటం"

రచన: "ముక్కోపి"

"గొడవగా మాట్లాడకూడదు. మనలో చాలామందికి యెంతటి చిన్న విషయాన్నయినా పెద్దగా కేకలు వేసుకుంటూ మాట్లాడే గుణముంటుంది. అవును అలాంటిది వొక చెడు అలవాటే అవుతుంది. ఇద్దరు ఓ విషయంగురించి చర్చించుకొంటున్నా వాదించుకొంటున్నా మూడవవాడికి వినిపించకూడదు. మనలో "కోమటి రహస్యం" అన్న సామెత

(గాన సభలో) ఒకావిడ: ఏమండీ! ఎప్పుడయినా కళ్ళు మూసుకుని పాట విన్నారా? ఎంత బావుంటుందో?

ప్రక్కావిడ: ఏమోనమ్మా! నాకు తెలిసినంత మట్టుకు నోరు మూసుకుని వినడం చాలా బావుంటుంది.

* * *

కాబోయే మామగారు: ఏమోయి! మా అమ్మాయిని పెళ్ళాడతానంటున్నావు. బాగానే వుంది. కాని ఆమె కోసం నేను నెలకు ఐదువందల రూపాయలు ఖర్చు పెడుతున్నాను. నీకు తెలుసా?

కాబోయే అల్లుడు: తెలియకేమండి. అందులో సగం ఇస్తే చాలు. అదీ నాజీతమూ కలిపి మేము కాలక్షేపం చేస్తాం.

సి. బి. జగన్నాధరావు, కాకినాడ.



## అద్భుతగిరి

పుంది. కొండమీద వైశ్య దంపతు లేదో రహస్యం మాట్లాడుకొంటూ వుంటే దిగువన వున్న ఓ పెద్దమనిషి పక్కవాడితో "ఆ గోల ఏమిటండి" అని అడిగాడట. "అబ్బే ఏమీ లేదండీ. అది వాళ్ళ రహస్య సంభాషణ" అన్నాట్ట. మనలో అలా మాట్లాడే వారున్నారు.

ఇంకొక విషయం చెప్తా వినండి. ఇది నేను యింగ్లీషులో చదువుకుంటున్నప్పుడు ప్రత్యక్షంగా చూచిన విషయం. లండన్ వీధుల్లో భారతీయు డొక్కడే పోతూ వుంటే అతని విషయం ఎవరూ పట్టించుకోరు. కాని యిద్దరు కలిసిపోతూన్నప్పుడు మాత్రం ఆ బాటను పోతూన్న యింగ్లీషు వాళ్ళందరూ తమ తమ పనులనే మరిచిపోయి వారిద్దరివేపు యెగాదిగా చూస్తూ వుంటారు. ఆ యిద్దరికి ముందు నూరు గజాల వరకూ, వెనుక వంద గజాలవరకూ వున్న జనం నిలిచి వాళ్లనలా ఆశ్చర్యంతో చూస్తూవుంటే మనకే ఆశ్చర్యమవుతుంది. అలాంటి పరిస్థితుల్లో, ఒకటి రెండుసార్లు, యేదయినా ఆక్సిడెంటు జరిగిందేమోనని అటూ యిటూ చూచి కాదని నిర్ధారణచేసుకొని అలాగే నిలుచుని చూచేవాడిని వెర్రిగా. తరువాత తెలిసింది అందుకుసరిఅయిన కారణమేమిటో. ఇండియన్లు వొకళ్ళతో వకళ్ళు మాట్లాడుకునే తీరు వాళ్ళనలా ఆకర్షించి విభ్రాంతుల్ని చేస్తుందిట. అంటే యింగ్లీషు వాళ్లు గట్టిగా మాట్లాడుకోరు. వారు దానికి అలవాటు పడలేదు. కాబట్టి గట్టిగా మాట్లాడుకొనేవాళ్ళను వారు అంత ఆశ్చర్యంతో చూస్తారు. వాళ్ళు ఒకరి స్వేచ్ఛ యింకొకరి స్వేచ్ఛకు అడ్డు తగలకూడదని నమ్ముతారు. ఆ అలవాటు దక్షిణాది వాళ్ళలో చాలా వుంది. వాళ్లు మాట్లాడుతూ వుంటే డబ్బాలో రాళ్లు వేసి మోగించినట్టే వుంటుంది. వాళ్ళకు దగ్గరలో వుంటున్నందుకు మనకు కూడా యింతో అంతో ఆదోషం ఆపాదించినట్లుంది." అని "గోడవగా మాట్లాడటం" అన్న వ్యాసాన్నెవరో "ముక్కోపి" వ్రాసినట్లూ, దాన్ని నేను చదువుతున్నట్లూ, నేను యింగ్లండు పోయి చూచిరాకపోయినా క్లాసులో గోల చేస్తున్నప్పుడు మా యింగ్లండ్ రిటర్న్ లెక్చరరు చెప్పిన దాన్ని ఆధారం చేసుకొని, పక్కవారి గొడవలను ముంచివేసే కంఠంతో అరిచాను. చదవలేదు. పక్కగదిలో పదినిమిషాలవరకు ఏవో గుసగుసలు వినిపించాయి. నాకర్థం కాలేదు. తరువాత చడీ చప్పుడు కాకుండా యెవరంతట వారు జారుకున్నారు.

మరునాడు బావిదగ్గర ఖాళీగా వుంది.

ఆసాయంత్రం గిరిధరరావు నన్ను టీ ఫలహారాల కాహ్వానించాడు. 

# పరోక్షము-సమక్షము

ఇల్లిందల సరస్వతీదేవి

వేణీరావు, హనుమాయమ్మ నేను ఎట్లాగో అవస్థపడి కలకత్తా మెయిలు అందుకున్నాము. టికెట్లు ఎంత ముందుగా తెప్పించుకొన్నా - మేము బయలుదేరిన సమయాన్నిబట్టి రైలుఅందుతుందని అనుకోలేదు. రాత్రిపూట చిన్న చిన్న స్టేషనులలో పెద్ద తరగతుల పెట్టెల తలుపులను తెరపించేలోపల రైలు కదులుతూ ఉంటుంది గార్డుచేసిన హంగామాతో మేము ఎట్లాగో ఎక్కటము జరిగింది రిజర్వు చేసుకోలేకపోయినా ప్రయాణీకులు హాయిగా కాళ్లు చాపుకొని నిద్ర పోతున్నారు. చొరవ చేసుకోలేని మేము ముగ్గురము మా పెట్టెమీద కూర్చున్నాము. ప్రయాణీకుల సౌకర్యార్థము కాబోలు దీపము ఆర్పి వేయబడ్డది.

ఒక స్టేషను దాటినతరువాత - వేణీరావు నా చేతిమీదతట్టి "అమూలగా - పైబర్తుమీద నుంచి వినబడుతున్న మాటలను ఆలకించు" అన్నది.

"ఊరోళ్లల్లో సంఘసేవ చేయని ఆడవాళ్లు ఉన్నారంటారా? చేతి సంచులతో ఎక్కడ చూసినా వాళ్లేనంటె నమ్ముతారో - లేదో!"

ఆ కంఠస్వరము ఆగకముందే రెండుమూడు గొంతులు పెద్దగా నవ్వాయి.

వాళ్ల షోకులను గురించి చెప్పాలంటే ఎన్ని రోజులయినా చాలవనుకోండి. మనము ఎంత తలవంచుకొన్నా - వాళ్లే పలకరించి మాట కలుపుతారు. - నాకు వాళ్ల ముసుగ్లను తలుచుకుంటే విపరీతమైన జాలి కలుగుతూ ఉంటుంది."

విన్నవాళ్ళంతా తన ధోరణికి మెచ్చి అభినందన పూర్వకముగా నవ్వుతారని కాబోలు కాసేపు ఆగినట్లున్నాడు.

"మీకు అనుభవము ఉన్నదో లేదో - నలుగురు ఆడవాళ్లు ఉంటారు - ఒకరితో మాట్లాడుతూ ఉంటే మరొకరికి కోపము. విధీ విసుగు లేకుండా వాగుడుతూ ఉంటే నే వాళ్ళు మనుష్యులనుకోండి."

అతడికి ప్రోత్సాహకరముగా ఈసారి నవ్వులు బాగా వినిపించాయి.

"ఏమిటో - పిల్లల తండ్రులను చూస్తే నాకు విపరీతమైన జాలి: ఎందుకో! మీకో తమాషా సంగతి చెప్తాను వినండి. ఈ రోజుల్లో మనమడిని ఎత్తుకుంటూ కూడా ఆడవాళ్ళు పౌడరు పూసుకుంటున్నారు. ఈ సంగతి తెలుసునా ?"

ఈసారి సుమారు పదిగొంతులు కలిసి నవ్విన ట్లే నవ్వాయి. అప్పుడు వేణీరావు ముఖము వెలుతురులో చూడగలిగితే ఎంత ఎర్రబడ్డదో తెలిసేది. మా హనుమాయమ్మకు నిద్రే సరిపోయింది.

తరువాత మాకు మాటలు సరిగా వినబడ లేదు కాని అప్పుడప్పుడు నవ్వులు మాత్రము వినబడుతూ వచ్చాయి. తెల్లవార వచ్చింది. మెయిలు వేగము రాత్రికంటె కొంత తగ్గినట్లనిపించింది. రైలు ఆగగానే మేము పెట్టెను కొంత ప్రక్కకు జరిపి కూర్చున్నాము.

అయిదారుగురు గబగబా తోసుకుంటూ లోపలికి వచ్చారు. మాకు వెనుకగా ఉన్న బర్తుదగ్గరగా నిలబడి "ఆయన ఇంకా లేవనట్లున్నారు. కాసేపు నిలబడదామా పోనీ-" అనుకుంటున్నారు. ఈ సందడికి ఆయన లేవనే లేచాడు. ఎన్ని రకముల అభినందనాలో - ఎన్ని పూలహారాలో లెక్క లేదు. వాళ్ల ఆనందోత్సాహాలతో ఆయనకు ఊపిరి సలుప లేదు. అయినా చిరునవ్వుతో అన్నీ స్వీకరిస్తున్నాడు. వాళ్ళు స్పెన్సరు కాఫీ బిస్కట్లు యిచ్చారు. ఆ స్టేషనులో దొరకే పత్రికలన్నీ ఆయనకు కొని యిచ్చారు. ఆయన "వద్దు! నాకెందుకు ఇవన్నీ?" అంటూనే రైలుదిగి - ప్లాటుఫారముమీద నిలబడి వాళ్లు ఫోటో తీస్తామనగానే పూల హారాలు జరీకండువా సర్దుకొన్నాడు!

ఇంత హడావడి ఏమిటా అని కనుక్కుంటే ఆయనట - ఒక సినిమా నటుడట!

ఏలూరు స్టేషను వచ్చేసరికి బండి లేటు అయిందేమో ఎనిమిదిన్నర కావచ్చింది.

అప్పటికి ప్రయాణీకులు చాలావరకు దిగిపోయారు. పైబర్తులమీద ఉన్న వారందరూ క్రిందికి దిగారు.

మేము మాటల సందడిలో రైలు నాలుగు స్టేషనులు దాటటము గమనించనేలేదు.

అంతలో ఒక యువకుడు కూర్చున్న స్థలములోనుంచి లేచివచ్చి, మా కెదురుగా కూర్చుని, ఇంగ్లీషు డైజెస్టు చదవటము మొదలుపెట్టాడు. కొంతసేపటికిగాని అతడు సరిగా చదవటము లేదని మేము కనుక్కోలేకపోయాము. మాలోకి కొంత చూడటానికి బాగుండేది హనుమాయమ్మ. నాలుగేళ్లు పెద్దదయినా షాపులముందర నిలబెట్టబడిన బొమ్మలా అలంకరించికొనేది వేణీరావు.

"నమస్కారమండీ అన్నాడా యువకుడు, మావైపు తిరిగి. నేను ఆ నమస్కారము 'ఎవరికో' అనుకున్నాను. హనుమాయమ్మ తనకేమోనని సందేహమైనాపడగు. వేణీరావు అందుకున్నది.

"సమితికి చాలామంది సభ్యులున్నారా? మీరు ఆర్గనైజరులా?" అడిగాడు కుతూహలముతో.



## పరోక్షము - సమక్షము



అతడు దేనినిగురించి అడుగుతున్నాడో తెలియక నేనూ హనుమాయమ్మ తెల్లబోయాము. వేణీరావు జవాబిచ్చింది. "వెయ్యిమందివరకు సభ్యు లున్నారు. వీళ్లిద్దరు కార్యనిర్వాహకవర్గసభ్యురాండ్రు. నేను కార్యదర్శినిని."

అతడు అందుకు తన సంతోషాన్ని తెలుపుతూ ఆ సమితిరిపోర్టు, నియమావళి ఇమ్మని అడిగాడు. ప్రస్తుతము అవి తనదగ్గర లేవని చెప్పుతూ - అనాథ శరణాలయము, హిందీ క్లాసులు, వయోజన పాఠశాల, చేతిపనులు, బాలెంతల వైద్యశాల ఏకధాటీగా నడుపబడుతున్నాయని వేణీరావు అనర్గళముగా చెప్పేసింది. అతడు వాటివివరాలను ఫోటోలను యిమ్మంటున్నాడు. ఆమె వెళ్లి పంపుతానన్నది. తన చిరునామా తెలపటానికి అతడు ఒక కార్డు ఇచ్చాడు. ప్రసన్న వదనముతో వేణీరావు అందుకొని తన సంచీలో పెట్టుకొన్నది.

"ఇప్పుడు స్త్రీలల్లో కూడా త్యాగమూర్తులు ఉద్భవిస్తున్నారు. సమాజసేవకురాండ్రంటే నాకెంతో గౌరవము. మీకు ఎంతసామర్థ్యము లేకపోతే మీ యిళ్లతో పాటు సంఘాన్ని దిద్దగలుగుతారు! ఒక్కొక్క ఊళ్లో ఎంత సోషల్ సర్వీసు చేస్తున్నారంటారు స్త్రీలు? ప్రతిశాఖ యంత్రములా నడుపబడుతున్నది. నావిచారమంతా [illegible] దానికే - ఏమిటంటే - మన సంఘము [illegible] ఉన్నదే - అది స్త్రీ మూర్తి విలువలను ఇంకా గ్రహించలేకపోతున్నది. మిమ్మల్ని కలుసుకున్నే భాగ్యము నాకు కలిగినందుకు చాలా సంతోషము. నమస్కారము. వెళ్లివస్తాను" అంటూ అతడు రైలుదిగివెళ్లిపోయాడు.

రైలు కదిలేవరకూ నిగ్రహించుకొని - ఈ నాటకమంతా ఏమిటంటే - వేణీరావు తన పెట్టెకు అంటించిన "మహిళాసమితి" అనే కాగితము చూపించింది. అప్పటికీ నాకు అర్థము కాకపోయింది.

"ఈ కార్డు చూడు. అతడొక పత్రికా విలేఖరట!" అంటూ ఒక కార్డు నా చేతికిచ్చింది. "రాత్రంతా మాట్లాడిన ఆగొంతు విన్నావుకదా. ఆ మాత్రము కంఠస్వరము గుర్తించలేవూ?" అన్నది వేణీరావు నా ముఖము చూస్తూ. నేను తెల్లబోయాను.

ఆమె వాక్యము పూర్తిచేయక ముందే మేము దిగివలసిన స్టేషను వచ్చింది. దిగిన తరువాత నేను అతడిని గురించే ఆలోచిస్తున్నాను - 'ఆ నటుడికి సన్మానము చేసిన వాళ్లలో ఈ విలేఖరి కూడా ఉన్నాడా - లేక గుంపులో ఎక్కడైనా ఉన్నాడా? విలేఖరి కనుక తప్పకుండా ఎక్కడో ఉండే ఉంటాడు' అని సమాధానపడ్డాను. అంతలో వేణీరావు కూలివాడికి పెట్టెను తీసుకొని రమ్మని చెప్పుతూ "అతడెంత పత్రికా విలేఖరో నేనంత సంఘసేవకురాలిని!" అని పెట్టెకు అంటించిన చీటీ కాస్తా లాగిపారేసింది.





# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 152. గ్రహములు తమ చుట్టూ తాము తిరుగుటకు కారణము

వివరించమని రాజమండ్రి నించి శ్రీ సూర్యనారాయణగారు అడుగుతున్నారు.

సర్కసులలో ఫీట్లు చేసేవారు పళ్ళతో మాత్రము ఒక గొలుసునో, త్రాసునో కరుచుకొని గిరగిర తిరగడము మీరు చూచి వుంటారు. వారు గిర్రున తిరుగుతూ చేతులనూ కాళ్ళనూ అడ్డము చాచినప్పుడు వారి





వేగము తగ్గుతుంది. అలాగ మెల్లిగా తిరుగుతూ చేతులూ కాళ్ళూ శరీరానికి దగ్గరగా ముడిచేస్తే మళ్ళీ వారి వేగము ఎక్కువౌతుంది. తిరిగే వస్తువు ముణుచుకుంటే వేగము ఎక్కువా, చాచుకుంటే తక్కువా అవడానికి కారణము "విడిగానున్న ఒక వస్తువుయొక్క వర్తులమార్గపు ఆవేగము మారదు, స్థిరముగానే వుండును" అన్న ప్రకృతి సత్యమే. వర్తులమార్గపు ఆవేగము వస్తువుయొక్క ద్రవ్యరాశిని వేగముచేతా, తరవాత (తిరిగే వర్తులమార్గపు) వ్యాసార్ధము చేతా గుణించిన వచ్చును. తిరిగే ఆ మనిషికి గల వర్తులమార్గపు ఆవేగము

'ద్ర' × 'వే' × 'ర'

అనుకుందాము. ఈలబ్ధము స్థిరముగా ఉండునంటే అర్థమిది: "తిరుగుతున్నప్పుడు ఆ వస్తువు వ్యాసార్ధము ('ర') మారితే వేగము కూడా మారి మొత్తపు ద్ర × వే × ర అన్న వర్తులమార్గ ఆవేగము మొదట వున్నంతే ఉంచుతుంది" అని. అందువల్లనే పై సర్కసు మనిషి చేతులు ముడుచుకుంటే 'ర' తగ్గి, మొత్తపు 'ద్ర × వే × ర' మారకుండా ఉండాలి గనక వేగము ఎక్కువైంది.

ఇప్పుడు తిరుగుతున్న మనిషి చాచిన తన చేతులలోని గుండ్లను గిరగిరా తిరుగుతూనే క్రిందికి జారవిడిచాడనుకుందాము ఆ గుళ్లు నిటాగ్గా కిందపడవు. తిరుగుతున్న గొడుగు ఓచల కొసలనించి వానచినుకుల్లాగ, వాలుగా పడతాయి. అంటే అవి వర్తుల మార్గ ఆవేగమును కొంత హరించుకుని పోతున్నాయన్న మాట.

ప్రథమాతకాలములో సూర్యుని పక్కనుంచి దూసుకుపోయిన నక్షత్రపు ఆకర్షణ వల్ల సూర్యగోళపు వాయువులు కొమ్మ ఆకారములో ఆ నక్షత్రమువైపు పొగుపడి, ఆ నక్షత్రము దాటిపోయిన తర్వాత మెల్లగా ద్రవీభవించి ఘనీభవించి గ్రహాలైనవని జీన్సు వైజ్ఞానికుని ఊహ. ఇంకొక నక్షత్రపు ఆకర్షణ సహాయములేకనే సూర్యమండల వాయువులు గ్రహాలుగా ఏర్పడగలవనే ఇటీవలి వాద మింకొకటికూడా కలదు. ఏది నిజమైనా, గ్రహముల ద్రవ్యరాశి సూర్యుడినుంచే వచ్చినదన్నమాట నిజము. సూర్యుడికి (తన చుట్టూ తాను తిరిగే) వర్తుల మార్గ ఆవేగము ఉన్నది. సూర్యుడినుంచి విడిపోయిన గ్రహగోళాలకి కూడా ఆ రకపు ఆ వేగము సంక్రమించడమువల్ల ఆ గోళాలు కూడా తమచుట్టూ, తాము గిరగిర తిరుగుతున్నాయి.

మరియొక చిత్రము. గ్రహములే కాదు. గురుడు, శని, భూమి, వరుణ, ఇంద్రగ్రహాలకి ఉపగ్రహాలున్నాయి, ఇవి తిరుగుతున్నాయి తమచుట్టూ తాము. గ్రహముల ఆ వేగములో కొంత వాటికీ సంక్రమించినది. అందువల్లనే అవికూడా తమచుట్టూ తాము తిరుగున్నాయి. ★

# చిట్టి ప్రశ్నలకు జవాబులు

—చిల్లగింజ అరగదీసినప్పుడు వచ్చే జిగురు నీటికంటె బరువు. కనక నీటితో దానిని కలిపి గిరగిరా తిప్పితే ధూళీ-మట్టీ-కణాలు ఈ జిగురుతో చేరి కరడుకుని, దాన్ని ఇంకా బరువెక్కించి క్రిందికి దింపేస్తూ తాముకూడా దిగిపోతాయి.

—మానవునికి కోపముకలుగుటకు ముఖ్య కారణము స్వార్థమూ, అహంకారమూను. ఇంకొకరికి నష్టము చేసేవారిపైన కోపించేవారు తక్కువ. కోపము వచ్చినప్పుడు కళ్ళెర్రబడడమూ, దవడలు దగ్గిరగా చేరుకోడమూ, గొంతు బిగ్గరగా వినబడడమూ, గుండె త్వరగా కొట్టుకోవడమూ జరుగుతాయి. హాయిగా నడిచిపోయే జీవితంలో కోపము అక్కరలేని ఉద్రేకాన్ని తెచ్చిపెడుతుంది. ఇది మంచిది కాదని వేరేచెప్పాలా శ్రీరామమూర్తిగారూ?





—అవును. కళ్ళు మసకలు కమ్మినప్పుడు రంగులు రంగులు కనబడతాయి. కంటికి మసక కప్పిన 'పొర' అంతటా ఒకే దళసరి ఉండదు. కనక గాజుపట్టకములో నుంచి ప్రసరించిన వెల్తురులాగ, ఈ పొరలోనుంచి ప్రసరించి కంటిలో చేరే వెల్తురు, ఈ పొరలో రంగులుగా విడిపోతుంది. అందుచేతనే మసక కన్నులకు రంగులు కనిపిస్తాయి.

—చీకటి అనగానే కటికి చీకటి కాదు గదా? తలుపులన్నీ బిడాయించి ఏపాటి వెల్తురూ రాకుండా చేసిన గదిలో పిల్లి కూడా ఏమీ చూడలేదు. పిల్లికంటికి వెనకవైపున, వెలుతురు పడితే మెరిసే పొర వుంటుంది. ఈ పొర రాత్రిపూట వస్తువుల నుంచి వచ్చే కొంచెపు వెల్తురుకి మెరుస్తుంది. ఆ మెరుపువల్లనే వస్తువులు కనపడతాయి పిల్లికి. పగటిపూట తీక్ష్ణమైన వెల్తురుపడి ఈ పొర మిరుమిట్లు కమ్మించకుండా ఉండడానికని పిల్లి తన కంటిపాపలను సన్నము చేసేసుకుంటుంది.

—నక్షత్రాలన్నీ మన భూమికి ఒకే దూరంలో లేవు.

—కొన్సరు అనగా శరీరములో ఒక అవయవము లోపల్నించి అక్కరలేని అతి పెరుగుడు బయల్దేరడము. ఇది ముక్కు, చెయ్యి, వంటి అవయవాలికే కాక నెత్తురులోని తెల్లకణాలికి గూడా కలగవచ్చును.

—వేళ్లు వంచకుండా చాలాసేపు వుంచినప్పుడు సంధులకడ ఎముకలు ఒకేచోట వుండిపోతాయి. వేలు విరిచినప్పుడు ఒక ఎముక ఇంకొకదానిని రాసుకుంటూ జరిగి గాడిలో పడుతుంది. ఇలా పడినప్పుడే చప్పుడవుతుంది. తిరగగలిగినంత మేరా తిరగకుండా చాలాసేపుండిపోతే సంధులదగ్గిర నరాలకి వచ్చే బండతనమే నొప్పి. విరవగానే ఆ నొప్పి పోతుంది.

—షేక్ బుడన్ సాగారికి (రాయపట్నం): మీరు భూమి రోజుకు 25000 మైళ్ళు మాత్రమే సూర్యుని చుట్టూ తిరగడములో జరుగుతోందనుకుంటున్నారు. కాదు. భూమి తనచుట్టూ తాను తిరిగే వేగమది. ఇదికాక సూర్యునిచుట్టూ తిరిగే వేగము వేరే వుంది. బొంగరము తన చుట్టూ తాను తిరుగుతూనే గిరులలో జరుగుతూ తిరగడము చూచివుంటారు. అలాగే భూమి తనచుట్టూ తిరుగుకుంటూ, సెకనుకి సుమారు 19 మైళ్ళ వేగముతో సూర్యుడి చుట్టూ తిరుగుతోంది. తనచుట్టూ తాను భూమి తిరిగే వేగము నిమిషానికి సుమారు 17 మైళ్లు మాత్రమే.

—నిమ్మరసములో మందమైన సిట్రిక్ ద్రావకము ఉండును. ఈ ద్రావకము లోహాలతో రసాయనిక సంయోగము చెంది సిట్రేటులను తయారుచేయును. ఈఉప్పు రంగు లోహాలరంగుకి భిన్నము. కనక అల్యూమినమూ, వెండీ పాత్రలు నిమ్మరసము పడ్డచోట మచ్చలు పడును.

—భాస్వరము అనే ధాతువు కలిసిన పదార్థాలు వెలుగును జీర్ణించుకుని చీకటిలో మెరుస్తాయి. నిలకడగా ఉండిపోయిన ఉప్పుపేటి నీరు మెరవడానికి ఆ నీటిలో భాస్వరముకల భస్మాలు చేరడమే కారణము.

—గ్రహణమంటే సూర్యుడికీ భూమికీ నడుమ చంద్రుడు వస్తే ఆ చంద్రుడి నీడ భూగోళముమీద పడడము. ప్రతి అమావాస్యనాడు భూమికి సూర్యచంద్రులు ఒకవేపునే ఉంటారు గాని చంద్రుడి నీడ (భూమి) నేలమీదగాని భూమికి అంటివున్న సముద్రాలమీదగాని పడదు. మరి అలాంటప్పుడు గ్రహణమంటే ఏమిటి? చంద్రగోళము మీద పడే సూర్యుని వెల్తురువల్ల ఆ గోళము వెనక ఉండే నీడ అనంతాకాశంలో తిరుగుతునే వుంటుంది. ఆ నీడ భూమిమీద పడితేనే సూర్యగ్రహణము కలిగిందంటాము. కనక మీ అభిప్రాయమే రైటు వీరారెడ్డిగారూ.

—పిడుగన్నది మేఘములోని విద్యుత్తు భూమిమీది ఎత్తైన కొసకి చేరిన వ్యతిరేక విద్యుదావేశముతో కలుసుకోడమే. కట్టడాలమీద ఎత్తుగా అమర్చిన రాగి చెయ్యి ఈ కలయికను సులువూ, నిరాపదాకరమూగా చేసేస్తుంది. చెట్టుగాని ఈ పని చేస్తే కర్ర విద్యుద్వాహకము కాకపోడము వల్ల విద్యున్నిరోధానికి కాలిపోతుంది. పై రాగిచేయి దళసరి బద్దీవల్ల భూమిలో పాతిన గొట్టానికి కలపబడి, మేఘాల విద్యుత్తుని జాయిగా దింపేస్తుంది.

ఏడియో ఏరియల్ మాత్రమే కాదు, ఇంటి ఆవరణలోని చెట్టుకీ ఇంటికీ కట్టిన తీగలు కూడా మబ్బుల రోజులలో అపాయకరము కాగలవు. అందుకే, మెరుస్తూన్నప్పుడు ఏరియల్ కీ రేడియో సెట్టుకీ సంబంధము తెంపి, ఏరియల్ కి భూమికీ సంబంధము కలుపుతారు. ప్రమాదము వస్తే మేఘాల విద్యుత్తు సెట్టుని ధ్వంసం చెయ్యదు.

—సూర్యుని వెల్తురు చంద్రునిపైబడి ప్రతిఫలించి 'వెన్నెల' అయినట్లే, భూమిమీద పడి ప్రతిఫలించినది 'భూమి కాంతి'గా ప్రసరిస్తుంది. ఈ కాంతియే శుక్లపాడ్యమి చంద్రుడిమీదపడి చంద్రరేఖనే కాక, బింబాన్నంతటిని మసక మసకగా కనపడేటట్టు చేస్తుందంటారు శాస్త్రజ్ఞులు. ★




# మతద్వేషం

వల్లభనేని

కుల, మత, శాఖా
ద్వేషము లతిగా
వేరులు పారిన
పాడు కాలమున
విష్ణుభక్తులే
విందు భోజనము
చేయుచుండి రొక
సుదినం బందున!

... ... ...

శివమతస్థులను
వెడమడ దిడుతూ
ఆనందిస్తూ
వున్నారంతా!

... ... ...

పిచ్చాపాటీ
కబుర్ల మధ్యలో
చిక్కాడంటూ
అరచా డొకడూ!

... ... ...

ఎవడెవ డంటూ
మొగదిగ జూస్తూ
విందు గుడుస్తూ
సందడి జేసిరి!

చిక్కాడోయీ
చిక్కాడూ - అరి
లింగన్నిడుగో
నొక్కేస్తాన్!

... ... ...

జాలిదలంచక
జాగొనరించక
నొక్కేసెయమని
భోక్తలు పలికిరి!

... ... ...

నుగ్గునుగ్గుగా
నుసిజేసేస్తిని
లింగణ్ణంటూ
పొంగేపోయెను!

... ... ...

ఉత్తమకార్యం
బొనరించావూ!
శివిగా డొక్కడు
జచ్చిన - గూడా
బలమే మనకని
సంతసించిరి
సర్వవైష్ణవులు!

ఇంతకు జరిగిన
దేమంటే - యా
స్వాములు మ్రింగే
భోజనమందున
రాయొక టుండీ
పంటిక్రిందనే
చిక్కిందంటా!

... ...

చిక్కిన రాయిని
శివుడంటూ డత
గాడూ!—చిక్కిన
శివిగాణ్ణేమో
చంపేసెయమని
సలహా లిచ్చిరి
మిగతా వారలు!
శిల కాస్తా మరి
శిథిలం బయితే
పరమానందం
పొందే రంతా!

... ...

భారత దేశము
నాశ మొందుటకు
మతకలహములే
ముఖ్యకారణము.



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి




































పంచతంత్రం

# సంధి-విగ్రహం

కాకులు అన్నీ కోలాహలముగ నాలుగు దిక్కులు తిరిగినవి: కొన్ని ఎలుకలను కొనివచ్చినవి.



ఎలుకల చంపి పచ్చి రక్తమును మంత్రి మేనుకూ రాచినవి.



చీకటి వేళకు చిరంజీవి-ఉలూకములు గల గుహ చేరింది- ఆర్తనాదమొనరించింది -చిరంజీవి ఆర్తనాదం-చెవిని బడిన ఉలూకములు- వెలికివచ్చి, అవసాన స్థితిలో గల-వాయసమును చూచినవి.- ఉపచారములెన్నో చేసి తమ-రాజు సన్నిధిని చేర్చినవి.






అది మొదలుగ చిరంజీవి రాజుగారి నెడబాయక ఆగుహలో సంచరించి వింతలన్ని ప్రదర్శించి, అందరినీ మాయచేసి వార్తలన్ని తెలుసుకొనెను

ఒక్కనాటి ఎండవేళ- ఉలూకములు నిదురించగ- వారికంట పడకుండా- చిరంజీవి ఎగిరివచ్చి- మేఘవర్ణు నెలవు చేరి- ఉలూకముల హతమార్చగ- ఉపాయమును బోధించెను.



చిరంజీవి బోధలువిని- కాకులన్ని ఒక్కుమ్మడి -మండు కొరివి పట్టితెచ్చి- ఉలూకములు నివసించే-గుహాకు అగ్నిరగిల్చినవి.



భగున మంటలు చుట్టుముట్టగా నిద్రను మునిగిన గుడ్లగూబలూ ఒక్కసారి ఉలిక్కి పడినవి.



(ఉపమర్దనునితో మంత్రులు) "మహాప్రభూ! మన్నించండి!- చిరంజీవిని చేర్చవలదను- హితవాక్యములను వినకపోతిరి -ఉలూక కులమునకంతటికీ- ఆ కృతఘ్నుడే ముప్పుతెచ్చెను!"



ఉపమర్దనుని పరివారం పరిపూర్ణంగా ఆహుతి ఆయినది. తమపగ తీర్చిన చిరంజీవినీ కాకములన్నీ ప్రస్తుతించినవి.



అద్దెబోటులో—

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

ప్రథమ పర్యాయంగా నేను పంటులో ప్రయాణం చేయబోవటం మరి ముగ్గురు మిత్రులతో కలిసి ఏర్పాటైంది. ఆ ముగ్గురు మిత్రులూ, పంటు నడపటం ఎలాగో నాకు చూపిస్తాం పదమన్నారు. ఇంటినుంచి అందరం ఒక్కసారే బయలుదేర లేకపోయాం. అంచేత నేను ముందుగా పడవల రేవుకి పోయి, పంటు నొకదానిని అద్దెకు మాట్లాడి వుంచుతాననీ, అందరూ వచ్చేలోగా కాస్త వొడ్డువెంటనే తిరుగుతూ ప్రాక్టీసు చేసి చూస్తాననీ చెప్పాను.

అదేమి కర్మమో—ఆరోజు ఎంత ప్రయత్నించినా ఒక్క పంటుకూడా అద్దెకి దొరకలేదు. రేవులో వున్న అన్ని పంటులకీ ఆరోజు పనిపడింది. మేము వేసుకొన్న ప్లాను అంతా తలక్రిందులైంది. చేసేది ఏమీ లేక, మిత్రులంతా వచ్చేదాకా, ఒడ్డు మీదనే కూర్చొని, వచ్చే పోయే పడవలని చూస్తున్నాను.

కొద్దిక్షణాలు గడిచాయి. ఇంతలో నదిమీద కొద్దిదూరంలో, అచ్చంగా నాకోటు, నాటోపీ మాదిరివే ధరించిన నాయీడువా డెవడో ఒంటరిగా పంటు నడుపుతూవుండటం నాకంట పడింది. నాకు చాలా ఆశ్చర్యంవేసింది. పైగా వాడికికూడా పంటు నడపటం కొత్త అల్లే వుంది; తికమకపడుతున్నాడు. వాడి పంటు కాస్సేపు ఎగువకి పోతోంది. మరికొంతసేపు దిగువకి వస్తోంది. ఇంకొంతసేపు వున్నచోటనే వుండిపోయి బొంగరం తిరిగినట్లు గిరగిరా తిరుగుతోంది.

నదికి యిటువైపు అటువైపు వున్నవాళ్ళందరు కూడా వీడు పంటు నడిపే ధోరణి చూసి విస్తుబోయి ఎక్కడ వున్నవాళ్లు అక్కడే నిలబడి చూస్తున్నారు. నేనూ చూస్తున్నాను.

మరికొన్ని నిమిషాలు గడిచాక మా మిత్రులు ముగ్గురూ నదికి అవతల గట్టుమీద ప్రత్యక్షమైనారు. వాళ్లు కూడా పంటుమీద పల్టీలు కొట్టుతున్న పడుచుకుర్రాణ్ణే చూస్తూవుండిపోయారు. అందులోనూ ఆ కుర్రాడి వీపు వీళ్ళవైపుకి వున్నదేమో—వాడి కోటూ, టోపీ చూసి, వాడే నేనే ననుకొన్నారు. తామింకా వచ్చేలోగా పంటుమీద ప్రాక్టీసు చేస్తూ వుంటానని లోగడ చెప్పానుకదా? అంచేత యిప్పుడు వాళ్ళ కళ్ళ ఎదుట కనిపించేదంతా నాతాలూకు ప్రాక్టీసు కాబోసనుకొన్నారు. పంటులాంటి అతి మామూలు వస్తువుతో యింతమందికి వినోదం కల్పిస్తున్నందుకు తమ మిత్రుణ్ణి కాస్సేపు పొగడుకొన్నారు. వాణ్ణి యింకా రెచ్చగొట్టాలన్న వుద్దేశంతో అడ్డదిడ్డమైన కేకలు వేయటం మొదలుపెట్టారు.

వాళ్లు ఎక్కడ పొరపాటు పడ్డారో నాకు

మూలం:
జెరోమ్ కె. జెరోమ్

అనువాదం:
విశ్వాత్ముల నరసింహమూర్తి

మొదట్లో అర్థంకాలేదు. అపరిచితుణ్ణి పట్టుకొని వాళ్లు ఆవరసని వేళాకోళం చేస్తున్నందుకు నాలో నేను కొంచెం నొచ్చుకొన్నాను కూడాను. వాళ్లని గట్టిగా కేకేసి ఆమాట చెప్పేద్దామనుకొంటూవుండగా, వాళ్లు పడ్డ పొరపాటు నాకు అర్థమైంది. ఈ నాటకం యిలా కాస్సేపు సాగనిద్దామని, ఒక చెట్టుచాటుకి పోయి దాక్కున్నాను.

అంతా చూస్తున్నాను. మా వెర్రి వెధవలు ఆ పరాయి కుర్రాణ్ణి పట్టుకొని ఏం వేళాకోళం చేశారని! ఏం ఎద్దేవా చేశారని! అబ్బో! మామూలుగా మా మిత్రబృందంవారు ఒకరిమీద ఒకరు ప్రయోగించే సరసాలన్నీ ఆ కుర్రాడిమీద ప్రయోగించారు. ఆ కుర్రాడు కూడా వూరుకొన్నంతసేపు వూరుకొని, యిక భరించలేక గిరుక్కున వెనక్కి తిరిగాడు. మా వాళ్ళు అతని మొఖం చూశారు!

అటువంటి పరాభవం జరిగినప్పుడు వెర్రి మొఖం పెట్టేసే మాత్రపు బుద్ధి మా వాళ్లల్లో యింకా మిగిలివున్నందుకు నాకు చాలా సంతోషం వేసింది. ఆ కుర్రాడిదగ్గిరకు వెళ్లి, అతణ్ణి చూసి తమ మిత్రుల్లో ఒకడైనట్లు పొరపాటుపడ్డామని సవినయంగా సంజాయిషీ చెప్పకొన్నారు. బాగా తెలిసినవాళ్లని తప్ప, పరాయివాళ్లని ఎంతమాత్రము అవమానపరచలేమని విన్నవించుకొన్నారు. ఆ గొడవ ఏదో అప్పటికి అలా సర్దుకుపోయిం దనుకోండి.

మా హారిస్సుకి యిదివరకు యిలాగే ఒకసారి చచ్చినంత పని అయింది. వాడొకరోజున 'బాలోన్' బీచిలో ఒంటరిగా యీత కొట్టుతున్నాడట. ఉన్నట్లుండి ఎవరో వీణ్ణి గట్టిగా మెడ పట్టుకొని నీళ్లల్లోకి ముంచేస్తున్నట్లు అనిపించిందట. మొసలిపట్టులా వున్న ఆ పిడికిలి విడిపించుకోవాలని, వీడు ఎంతో గింజుకొన్నాడట, కాని అదేమీ లాభం లేకపోగా, జీవితపు ఆఖరి క్షణాలలోనైనా భగవంతుణ్ణి తలుచుకొందామని నిశ్చయించుకొన్నాడట. సరిగ్గా ఆ సమయంలో వీణ్ణి బలవంతంగా నీటిలో ముంచిన 'హంతకుడు' పట్టు వదిలేశాడు.

బ్రతుకుజీవుడా అని వీడు వుక్కిరి బిక్కిరి అవుతూ, తడవకు గుక్కెడు నీళ్లు మింగేస్తూ వుక్కిలిస్తూ ఎల్లాగో కాళ్లమీద నిలబడి నీటిమీదికి తల ఎత్తి, తనను హత్యచేయబోయిన వ్యక్తి ఎవరోనని చూశాడట. 'హంతకుడు' యింతసేపూ వీడిపక్కనే నిలబడి పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతున్నవాడల్లా, హారిస్సు మొఖం చూసీ చూడటంతోటే కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండా తయారయ్యాడు.

"క్షమించాలి: పొరపాటైపోయింది. మిమ్మల్ని వెనకనుంచిచూసి మా స్నేహితుడనుకొన్నాను" అంటూ ఆ 'హంతకుడు' వీడి కాళ్లావేళ్లా పడి బ్రతిమాలాడట.

ఆ పెద్దమనిషి తనని స్నేహితు డనుకొన్నాడు కాని, చుట్ట మనుకొనివుంటే యింకా ఏం కొంప మునిగేదో అని హారిస్సు చాలా గాభరాపడ్డాడు. చుట్ట మని గనక అనుకొనివుంటే చచ్చేదాకా చంపేసేవాడే నని వీడి నమ్మకం!

తెరచాప కట్టిన పడవ నడపటానికి కొంత అనుభవమూ, తెలివితేటలూ వుండాలి. నా చిన్నతనంలో అవేవీ అవసరం లేదనుకొనేవాణ్ణి. నాలాంటివాడే మరో కుర్రాడు కూడా నాకు జతపడ్డాడు. వాడూ నేనూ కలిసి ఒకనాడు ఒక చిన్నపడవ అద్దెకు తీసుకొని బయల్దేరాం.

"నది వొంపులో కొంచెం జాగ్రత్తగా నడపండి" అని హెచ్చరికచేశాడు——మాకు పడవ అద్దెకు యిచ్చిన ఆసామి.

ఎంత వొంపు అయితేమాత్రం అంత శ్రద్ధ జాగర్త ఎందుకో మాకు అర్థం కాలేదు. మా పడవ వూరు దాటిపోయే సమయానికి తుఫానుగాలి వీచటం ఆరంభమైంది. అది తుఫానుగాలి అని మాకేం తెలుసు?——మంచిగాలి వీస్తోందికదా——తెరచాప ఎగరేద్దా మనుకొన్నాం.

చాప చుట్టగా పడివున్న తెరచాపను మా మిత్రుడూ నేనూ కలిసి కొంత కష్టంమీద విప్పాం. తీరా విప్పిన తరువాత దీనికి చివర ఏదో మొదలు ఏదో మాకు ఎంతకీ బోధపడలేదు. తలలు పట్టుకు యోచించి యోచించి, చివరకి తెరచాపకి ఒకవైపును చూసి యిదే దాని అడుగుభాగమనుకొన్నాం. నిజానికి అది దాని పైభాగం. చాలాసేపు తంటాలుపడి పైభాగం కిందికి, కిందిభాగం పైకే వచ్చేలా బిగించాం.

తెరచాప మమ్మల్ని చూసి దాని మనస్సులో (మనస్సు అంటూ వుంటే!) ఏమనుకొందో ఏమో



# ముచ్చటగా ముగ్గురు



కాని—గభీమని వచ్చి నా తలమీద పడిపోయింది. ఇక అక్కణ్ణుంచి ఎంత తన్నుకొన్నా, పీసమెత్తు పని అయినా అది చేయలేదు.

"దాన్ని నీళ్లల్లో పడేసి తడపరా!" అన్నాడు మా మిత్రుడు. పెద్ద పెద్ద ఓడలు నడిపే మొనగాళ్ళే తెరచాపను తడపకుండా బిగించలేరనికూడ మావాడు అన్నాడు. నేను తడిపాను: కాని దానివల్ల పరిస్థితి మరింత విషమించింది. పొడిదైనా—తెరచాప దాని పని అది చెయ్యకుండా మొరాయిస్తే మనకి మహా చిరాకుగా వుంటుంది. తడిదైతే—ఇక చెప్పనే అక్కర్లేదు.

మేమిద్దరమూ కలిసి ఎలాగైతేనేం చివరికి తెరచాప బిగించాం—తల్లకిందులుగా కాదనుకోండి: ఏటవాలుగా!

అలా కట్టినందువల్ల పడవ ఒక పక్కకి పడిపోవడం జరగలేదంటే అందులో అబద్ధం మాత్రం ఏమీ లేదు. అది ఎందుకు పడలేదని అడిగితే మాత్రం నేనేమీ సమాధానం చెప్పలేను. ఎందుకు పడిపోలేదా అని అప్పటికీ యిప్పటికీ నేను పదేపదే ఆలోచిస్తునే వున్నాను, కాని ఎందుకు పడలేదో నాకు యింతవరకు బోధపడలేదు.

కారణం ఒకటై వుంటుంది—ఈ ప్రపంచంలో ప్రతిదీ మనం కోరుకొన్న దానికి వ్యతిరేకంగా నడుస్తూ వుంటుంది. అలాగే మా యిద్దరి వాలకాన్నీ చూసి, మేమేదో ఆత్మహత్య చేసుకోవటానికి వచ్చిన బాపతు అని మా పడవ అనుకొనివుంటుంది: అంచేత ఆరోజు అది చస్తే మమ్మల్ని చచ్చిపోనివ్వ దలుచుకోలేదు. అంతకు మించి వేరే కారణం ఏమీ నాకు తట్టడం లేదు.

మా పడవ ఏటివాలున పడి విపరీతమైన వేగంతో పరుగెత్తింది. అంత వేగంగల పడవలో అప్పటికీ యిప్పటికీ నేను మళ్ళీ ప్రయాణం చెయ్యటం అన్నది జరగలేదు: జరగాలనీ అనుకోవటం లేదు. మా పడవ అంత వేగంతోనూ పోయి పోయి, నది వొంపులో ఒకచోట తెరచాప సగంవరకూ నీటిలో మునిగిపోయింది. ఇంతలో ఏం విచిత్రం జరిగిందో ఏమో, మాకైతే తెలియదు కాని, దాని అంతట అది నీటిమీదికి తన్నుకువచ్చి తెగదూసుకొంటూ పోయి చివరి కొక బురదగుంటలో గుచ్చుకుపోయింది. అప్పటికి మాకు పడవలో అటూ యిటూ తిరగటానికి కొంత స్వేచ్ఛ వచ్చింది. చప్పున పోయి తెరచాప తాళ్లు అన్నీ కోసేశాం.

అప్పటికే చాలా సేపటినుంచి తెరచాపకట్టి పడవని నడిపించాం కాబట్టి అంతటితో అది విసుగేసింది. తెరచాప దించి తెడ్లు వేద్దామని మేమిద్దరమూ నిర్ణయించుకొన్నాం. పడవలో వున్న రెండు తెడ్లనీ యిద్దరమూ చెరొకటీ తీసుకొని బురదలోకి గుచ్చి పడవని కదిలించాలని చూశాం. ఆ ప్రయత్నంలో ఒక తెడ్డు సగానికి విరిగిపోయింది. ఎంత జాగ్రత్తగా వున్నా, రెండో తెడ్డుకూడా విరిగింది. మొత్తానికి మాపడవకి తెడ్లు అనేవి లేకుండా పోయాయి. మే ముభయులమూ నిస్సహాయులమైనాము.

అక్కడ, బురదగుంట, మా ముందువైపున బాగా వంద గజాల పొడవు వుంది. మా వెనకవైపు, నది. అటువంటి పరిస్థితుల్లో—పడవలో ఎక్కి కూర్చుని యింకేదైనా పడవ యీవైపు రావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కూర్చోవటంకన్నా మేము చేయగలిగింది ఏమీ లేదు.

నాటి వాతావరణప్రభావ మేమోకాని, పక్కా మూడు గంటలు గడిచేదాకా మేము వున్నవైపుకి ఒక్క బోటూ రాలేదు. చివరికి ఎవరో ముసలి బెస్తవాడొకడు నావమీద వచ్చి, మమ్మల్ని చూశాడు. అతికష్టంమీద మా పడవని రొంపిలోనుంచి పైకి లాగి, తన పడవకి మా పడవని కట్టేసి పట్నానికి నడిపించుకు పోయాడు.

మమ్మల్ని సజీవంగా కొంపకి చేర్చిన ఆ ముసలాడికి యిచ్చుకొన్న దాంతోనూ, తెడ్లు విరగ్గొట్టినందుకు పడవవాడికి యిచ్చుకొన్న నష్టపరిహారంతోనూ మేము వుభయులమూ ఎన్నో రోజులనుంచీ భద్రంగా దాచిపెట్టుకొంటూ వచ్చిన చిల్లర డబ్బులన్నీ ఖర్చు అయిపోయాయి. ఏమైతేనేం తెరచాప ఎత్తి పడవ నడపటంలో మాకు మంచి అనుభవం మాత్రం వచ్చింది.

## 16

పొద్దున పదకొండు కొట్టేసరికి మా పడవ 'రీడింగ్' పట్టణపు పొలిమేరలని తాకింది. ఇక్కడ థేమ్స్‌నదీ జలం అంతా కస్మాలంతోనిండి రోత పుట్టిస్తుంది. ఆ పట్టణానికి దగ్గరదాపుల్లో కొత్తవాడెవ్వడూ ఆట్టేసేపు వుండలేడు. ఆ వూరుకూడా చాలా పురాతనమైంది.

ఇటీవల కొన్ని దశాబ్దాలుగా లండన్ మహా నగరపు పౌరులకి యీ పట్టణం చిత్రమైన వుపయోగానికి పనికివస్తున్నది. లండన్ పరిస్థితులు దుర్భరమైనప్పుడు, జనం యిక్కడికి కొట్టుకు వస్తుంటారు. 1625 లో కాబోలు— లండన్‌లో ప్లేగువ్యాధి వుధృతంగా వచ్చినప్పుడు బ్రిటిష్ పార్లమెంటు పార్లమెంటే యిక్కడికి తరలివచ్చింది. ఒకవిధంగా ఆలోచిస్తే లండన్‌లో ప్రతిఏడూ ప్లేగు ఒక్కసారి వచ్చిపోతూంటే బాగుండును — కొద్దిరోజులపాటైనా ప్లీడర్లు పార్లమెంటుసభ్యుల పీడ ఆ నగరవాసులకి లేకుండా పోతుంది.

'రీడింగ్ లాక్' దగ్గరకు చేరేసరికి మాకు ఒక స్టీమ్‌లాంచ్ ఎదురైంది. అది మా మిత్రబృందంలో ఒకరిది. వాళ్లు మామీద జాలిదలిచి, మా పడవని వాళ్ల లాంచ్‌కి వెనకకట్టేసి 'స్ట్రీట్లీ' వరకు యీడ్చుకుపోయారు. లాంచ్ చేత లాగబడిన పడవలో ప్రయాణం చెయ్యటం సరదాగా వుంటుంది. నామటుక్కు నాకు అల్లాంటి ప్రయాణం అంటే చాలా యిష్టం. నాటి ప్రయాణంలో ముష్టిపడవలూ, దోన్నెలు మాదారికి తెడవ తడవకీ అడ్డంరాకుండా వుంటే, యింకా ఎంత బాగుండునోకదా అనిపించింది. ఈ చచ్చుపడవలకోసం మా లాంచి వేగాన్ని మాటిమాటికీ తగ్గించుకోవలసి వచ్చేది. దాంతో మాకు చెడ్డచిరాకు పుట్టుకొచ్చేది.

లాంచి పోయేదారికి అడ్డం రావటమేకాక— లాంచి బాయిలర్ బద్దలైపోయేటంత బిగ్గరగా 'విజిల్' వేసినాకూడా ఆ పడవలవాళ్లు వినిపించుకోరే! నాకే గనక అధికారం వుంటే, కేవలమూ యీ చిన్నిచిన్ని పడవలకు బుద్ధిచెప్పటం కోసం, ఆరోజు ఒకటిరెండు పడవల మీదిగా మాలాంచిని తోలేసేవాణ్ణి: తరువాత ఏమైతే అదే అయ్యేది!

'స్ట్రీట్లీ' చేరాక ఆ లాంచి మా పడవని వదిలేసి, దానిదారిన అది పోయింది. ఇక అక్కడనుంచి పడవనడిపేవంతు నాదని హారిస్సు అనటం మొదలు పెట్టాడు. వీడిధోరణి నాకు చాలా విపరీతంగా తోచింది. ఆరోజు వుదయం పడవకి లంగరు ఎత్తబోతూ 'రీడింగ్'కి ఎగువని మూడుమైళ్లు దాటేవరకు నేను పడవని నడపాలని ఒప్పందం చేసుకొని మరీ బయలుదేరాం. అవునా?— ఇప్పటికప్పుడే మాపడవ 'రీడింగ్' దాటి పదిమైళ్లదూరం వచ్చేసింది. ఇంకా పడవ నేనే నడపాలనటం ఏమిటి?

ఎన్నిచెప్పినా, ఏమిచేసినా జార్జి, హారిస్సు, యిందులోవున్న ధర్మాన్ని గుర్తించేటట్లు లేరు. ఆ విషయమై వాళ్లతో ఇక వాదించికూడా ప్రయోజనం లేదనిపించి, నేనే తెడ్లుతీసుకొని పడవ నడపటం మొదలు పెట్టాను.

మాపడవ పదిగజాలైనా పోయిందో, లేదో— యింతలో నల్లటి వస్తువేదో నీళ్లలో కొట్టుకు రావటం జార్జి చూశాడు. పడవని ఆవస్తువుకి దగ్గరగా నడిపించాం. జార్జి పడవలోనుంచి బయటికివొంగి ఆవస్తువుని చేత్తోపట్టుకుని పైకి లాగబోయాడు. దాన్ని తాకినవాడు తాకినట్లు వులిక్కిపడి వెనక్కి పడిపోయాడు.

వాడు పైకి లాగబోయిన వస్తువు ఒక స్త్రీ తాలూకు శవం! ఆశవం నదీ ప్రవాహంలోపడి అవలీలగా కొట్టుకొస్తున్నది. పాపం— ఆస్త్రీ ఎవరో కాని, పెద్ద అందగత్తె కాకపోయినా, ఆమె మొఖం చూస్తున్నంతసేపూ అదొక రకమైన అలౌకికత్వం కనిపించింది. వయస్సుకు మించిన వార్థక్య సూచనలు ఆమె మొఖంలో బలంగా నాటుకుపోయి వున్నాయి. ఆమె అనుభవించిన దారిద్ర్యం తాలూకు చిహ్నాలు అచ్చుగుద్దినట్లు కనిపిస్తున్నాయి. బ్రతికినంతకాలమూ బాధలు పడిపడి, చివరికి జీవుడు బొందిని వదిలిపెట్టి వెళ్లాక కనుపించే హాయి ఏదో ఆమె మొఖంలో కనుపిస్తున్నది.

ఈశవంమూలంగా కోర్టులచుట్టూ ఎక్కడ తిరగవలసి వస్తుందో ఏమోనని మేము చాలా కంగారు

(56 వ పేజీ చూడుడు)

# చిరకాల నిద్రితుడు

మూలం: వాషింగ్టన్ ఇర్వింగ్ ★ అనుసరణ: మధురాంతకం రాజారాం

ఒక్కొక్కప్పుడు ఈ ప్రపంచంలో మానవుడు కలలోనైనా ఊహించలేని అద్భుతమైన సంఘటనలు జరిగిపోతుంటాయి. గొప్పగొప్ప రచయితలు తమ అమోఘమైన మేధాశక్తితో కల్పించే చిత్రవిచిత్ర కథలకన్నా లోకంలో జరిగే వాస్తవిక సంఘటనలే ఒకప్పుడు ఎక్కువ ఆశ్చర్యకరంగా వుంటాయికూడా!

1933, అక్టోబరు మొదటి వారంలో ఈ కథ ప్రారంభమౌతుంది. అప్పటికి నాగరికత ఏ పట్టణాల్లోనో తప్ప, పల్లెటూళ్లలోకి అట్టే వ్యాపించలేదు. కోటు, బూటు, బూట్లతో మెడకొక టై కట్టుకొన్న ప్రభుత్వోద్యోగిని చూస్తే, సాలుకు వెయ్యిబస్తాల ధాన్యం పండించే మేటిరైతు సైతం గడగడలాడే వాడు. ఒక మైలు దూరంలో ఎక్కడో బస్సువచ్చే శబ్దం వినబడితే గ్రామాల్లోని పిల్లా, జెల్లా అందరూ రోడ్డుదగ్గరకు పరుగెత్తి విపరీతమైన ఆనంద కోలాహలంతో దానికి స్వాగతమూ, వీడ్కోలులు ఒకేసారిగా ఇచ్చేవాళ్లు. ఇక రైలుప్రయాణం చేయడమంటే పల్లెటూరి వాళ్లకు ఏనుగెక్కినంత సంబరంగా వుండేది.

ఇరవై ఏళ్లక్రిందు ఎవరైనా తిరుపతి వేంకటేశ్వర స్వామిని దర్శించడం కోసమో, చంద్రగిరిలో తెలుగు రాజులు నిర్మించిన రాజమహాలును వీక్షించడం కోసమో, లేక మరే కార్యార్థమో గూడూరు, పాకాల జంక్షన్ల మధ్య రైలుప్రయాణం చేసి వున్నట్టయితే, వాళ్లు చంద్రగిరి, తిరుపతి స్టేషన్లకు మధ్య రైల్వే వారధి క్రింద ప్రవహించే సువర్ణముఖీనదీ తీరంలో రైలుదారికి ఒక మైలు దూరంలో రెండు కొండల మధ్యన వున్న ఒక చిన్న పల్లెటూరిని తప్పక చూచివుండురు. ఆ కుగ్రామం పేరు పెంటపాడు. ఇరవై, ముప్పై పూరిండ్లు, ప్రభుత్వంచేత గుర్తింపబడని ఒక వీధిబడి, మన కథాకాలంనాటికే సంపూర్ణ శిథిలావస్థలోవున్న సీతాలక్ష్మణ సహితుడైన శ్రీరామ చంద్రమూర్తి కోవెల, ఈ హంగులతో ఆవూరు మిగతా ప్రపంచంతో సంబంధం వదలుకుని అడవుల్లో కందమూలాదులు తింటూ కాలక్షేపంచేసే సన్యాసిలా కనపడేది రైల్లో పయనించేవారికి. సందెచీకటి వేళల్లో చెట్లమధ్యన వున్న ఇళ్లు కనపడక, గ్రామానికి ప్రక్కనవున్న రెండు కొండలు, ఇళ్లల్లో ఆపాటికి వంటలు ప్రారంభమౌతాయి గనుక చూరుల్లోనుంచీ బయటికి వచ్చి సుడులు సుడులుగా గగనానికి ప్రాకిపోయే పొగ— వీటినిచూచి రైలు ప్రయాణీకులు ఆ చిట్టడవిమధ్య ఎవడో ఒక కాపాలికుడు మారణ హోమం చేస్తున్నాడేమోనని భీతి చెందేవాళ్లు.

ఆవూళ్లో, కోవెలకు ఎదురుగా వున్న ఒక చిన్న పూరికొంపలో సీనయ్య అనే సజ్జనుడు నివసించేవాడు. చంద్రగిరి రాజులు 'అరివైరి కంఠ విలుంఠన కాల కంఠీరవులై' అనేక యుద్ధాలు చేసినకాలంలో సీనయ్య యొక్క పూర్వీకులు కాసెచుట్టి, కత్తిబట్టి కలియుగ సవ్యసాచుల్లా శత్రువుల్ని తునుమాడి ఆ పరగణాలో ధైర్యానికి, శౌర్యానికి పెట్టింది పేరుగా ప్రసిద్ధి చెందారు. కాని, తాత ముత్తాతల శౌర్యసాహసాల్ని బట్టి సీనయ్యను కూడా ఒక మహావీరుడికింద జమ కట్టడం అంత సబబుకాదు గదా! వీరత్వం సంగతి ఎలాగున్నా వినయానికి, సౌజన్యానికి, నీతికి, నిజాయితీకీ సీనయ్య ఆట పట్టయిన వాడు. అతడింత మంచివాడు కావడానికి అతడి భార్యే కారకురాలని పెక్కుమంది భావించేవారు. స్వగృహంలో గయ్యాళి భార్యయొక్క నోటి దురుసుతనం క్షణక్షణమూ తనపైన విరుచుకు పడుతున్నప్పటికీ, ఇంచుకైనా చలించకుండా తాల్మిని వహించగల మగవాడు ఆత్మనిగ్రహంలో బ్రహ్మర్షులను మించిన వాడనీ, అలాంటివాడు లోకులచేత మంచి వాడనిపించుకోడం ఒక అతి సామాన్యమైన విషయమే నని విజ్ఞులు చెబుతుంటారు. నిత్యమూ, నిరంతరమూ ఐన బాధల్ని మూరు

మాటాడకుండా భరించగల ఓర్పును ప్రసాదించే గయ్యాళి భార్య దొరకడమనేది కూడా భగవంతుడి వరప్రసాదమే అయితే, అలాటి వరప్రసాదం మాత్రం సీనయ్యకు రెండు మూడింతలు ఎక్కువగా లభించిందని మనం బల్లగుద్ది వక్కాణించుకోవచ్చు.



సీనయ్య భార్యపేరు సంక్షేపంగా తాయారు. పూర్తిగా చెప్పాలంటే అలిమేలు మంగ తాయారు. పెంటపాడు వనితా మండలికి సీనయ్య ఎంత స్నేహపాత్రుడో, తాయారమ్మ అంత ఆజన్మ శత్రువు. వాళ్లకు సీనయ్య పైనవున్న జాలి అభిమానాలే, గాక, తాయారుపైగల ద్వేషం, ఆగ్రహముకూడా అపారం. సీనయ్యలా వాళ్లభర్తలు వాళ్లకు లొంగివుండక పోవడమే ఇందుకు కారణం కావచ్చు. వంటలు ముగిసిన తర్వాత, మగవాళ్లు పొలాల నుంచీ ఇంటిముఖం పట్టడానికి ముందూ జరిగే పెంటపాడు మహిళా మండలి సమావేశాల్లో సీనయ్య తప్పక పాల్గొనేవాడు. అతడువీధిలో కనబడితేచాలు, పిల్లలందరూ నవ్వుతూ, చప్పట్లు చరుస్తూ అతడివెంట బడేవారు. రెండు జట్లుగాచీలి పిల్లలు ఆడుకునే ఆటలకు మధ్యవర్తిగా వుండేగాక గాలిపటాలు, బొంగరాలు, బంకమట్టి బొమ్మలు మొదలైన ఆటవస్తువులు చేసియిస్తూ సీనయ్య బాల బాలికలకందరికీ అనుంగు చెలికాడు'లా వుండేవాడు.

సీనయ్య ప్రవర్తనలోవున్న ఒకే ఒక్క ముఖ్యదోష మేమిటంటే, లాభదాయకమైన ఏ పనిమీద గానీ అతడికి బొత్తిగా యిష్టం లేక పోవడం. అందువల్ల అతడిని సోమరిపోతన డానికి ఎంత మాత్రమూ వీల్లేదు. ఇరుగు పొరుగు వాళ్లొకొక్కసారి ప్రాధేయ పడితేచాలు, అతడు కొండలైనా పిండిచేయడానికి సిద్ధంగా వుండే వాడు. అంత గొప్పపనులదాకా ఎందుకూ, పొరుగింటి మల్లమ్మ బాలింత రాలుగా వున్నప్పుడూ, ఎదురింటి ఎల్లమ్మకు శిరోవేదన కలిగినప్పుడూ, సీనయ్య ఆహ్వానం లేకపోయినా వెళ్లి వడ్లు దంచి యివ్వడమో, కట్టెలుచీల్చి యివ్వడమో చేసేవాడు. ఒక మాటలో

"దూరంగా మిలమిల
    లాడే గుడారాలు
చూస్తే కురుక్షేత్రం
    లాగుంది" పంతులు
అంటే "కాదు
    పంతులూ,
అదే మన
    కర్నూలూ,
కురుక్షేత్రం కాదు,
    ఆంధ్రుల కాపిటలు"

"ఎన్ని మాట్లు గడ్డం
    గీస్తావ్ రోజుకి?"
అని అడిగాను
    కుతూహలానికి.
"అధమం
    పాతికసార్లు!"
ఖంగారు వద్దు
    చదువర్లు!
అతగాడధినేత
    సుఖక్షౌరశాలకి!
    —ప్రభాకరం, భాస్కరం.

# చిరకాల మిత్రుడు

చెప్పవలసివస్తే ఇతరులకోసం ఎంత కష్టమైన పనయినా చేయడానికి సంసిద్ధుడయ్యే సీనయ్యకు తన యింట్లో మాత్రం ఈవైపున పడివున్న చెత్తను ఆవైపుకు చేరవేయడం కూడా ఒక అసాధ్యమైన పనిగా తోచేది.

సేద్యం చేయడం ఒక నిరుపయోగమైన పని అని అతిచెప్పాడో నిర్ధరించుకున్నాడు. అందుకు తోడూ అతనికున్న కొద్దిపాటి భూమికూడా వట్టి చవిటిపర్ర. పెంటపాడు ప్రక్కన ఎక్కడైనా గనుములేని పొలం, కంచెలేనిపైరు కనపడితే అది తప్పనిసరిగా సీనయ్యదైవుంటుంది. ఆల కాపల్లు ఆదమరిచి ఏ చెట్టుక్రిందనో పడుకుని నిద్రపోతే, ఆవులన్నీ కలిసి మాట్లాడుకున్నట్టు ఒక్కుమ్మడిగా వెళ్లి సీనయ్య పైర్లలోపడేవి. చుట్టుప్రక్కల పొలాల్లోనుంచీ వెడలగొట్టబడిన కలుపుచెట్లన్నీ సీనయ్య యొక్క మంచితనాన్ని ఆసరాగా చూచుకొని అతని పొలాల్లో ఏపుగా పెరిగి ఒకతోపుగా మారిపోయేవి!

సీనయ్య పెద్ద కుమారుడిపేరు గోపులు. వాడిని గురించి చెబుతూ వృధాగా కాలహరణం చేయడం కంటే గుణగణాల్లో వాడు సీనయ్యకు డిటో అనేయడం ఉత్తమం. గోపులుకంటే చిన్నవాడు రాముడు. ఆ కుటుంబంలో తప్పి పుట్టినట్టుగా రాముడు మాత్రం ఆవుల్ని మేపుకరావడం, గడ్డి తేవడం— ఇలాంటి ఉపయుక్తాలైన పనులుచేసి తాయారమ్మకు అభిమాన పాత్రుడయ్యాడు.

కష్టపడి ఒకరూపాయ సంపాదించడంకన్నా, పస్తుండి ఒకణా దారపోసుకోవడమే మంచిదని భావించి, చింతలకు వంతలకు అతీతులైన మహావిరాగుల శాఖకు చెందినవాడు సీనయ్య. తాయారమ్మే గనుక పేపుక తినకుండా వుంటే అతడొక రాజాధి రాజులా జీవితాన్ని సంతృప్తితో గడిపివేసి వుండేవాడు. కానీ ఆమె రాత్రనక, పగలనక కుటుంబాని కతడు తెస్తున్న వినాశనాన్ని గురించి మాటమాటకీ లెక్కరిస్తూ సంతతధారాపాతంగా చీవాట్ల వర్షం కురిపిస్తూ వుండడంవల్ల అతడికి గృహపరిసరాల్లో శాంతిభద్రతలు లభ్యమయ్యేవి కావు. అందువల్ల అతడు తాయారమ్మ నోరు విచ్చుకోవడం అవసరంగా ఇంట్లోనుంచీ నిష్క్రమించేవాడు.

ఎలాంటి విషమ విపత్కర పరిస్థితిలోనైనా సరే సీనయ్యను తోడునీడలా అంటుకతిరిగే ప్రాణి ఒకటుండేది. దాని పేరు భైరవి. సోమరిపోతులకే గనుక ప్రత్యేకంగా ఒక రాజ్యమంటూ ఏర్పడితే దానికి సీనయ్యను రాజుగానూ, భైరవిని ప్రధాన మంత్రిగానూ నియమించవచ్చునని తాయారమ్మ అభిప్రాయం. ఆమెకు కోపంవస్తే అది ఒక్క సీనయ్యపైనే కాదనీ, ఆకోపం యొక్క ప్రభావం తనపైన కూడా ప్రసరించవచ్చునని భైరవికి బాగా తెలుసు. నిజం చెప్పవలసివస్తే భైరవి పిరికిజంతువు కానేకాదు. ఆ మాటకువస్తే అది అరణ్యంలో ఎలాంటి క్రూర మృగాన్నయినా చీల్చి చెండాడగల జాగిలరాజం— ఐతే సమస్త జగతినీ గడగడలాడించగల గయ్యాళితనం మోాల ఎంతటి ధైర్య సాహసాలైనా తృణప్రాయాలేకదా! ఎవరింటి దగ్గరైనా, ఏ వీధిలోనైనా, కడకు మహారణ్యాల్లో సైతం నిర్భీతిగా సంచరించే భైరవి తన యజమాని

ఇంట్లో మాత్రం తనేదో భయానకమైన పరిస్థితిలో ఇరుక్కుపోయినట్టు, ముఖం వేలవేసుకుని వుంటూ పీటకొయ్యనో చీపురుకట్టనో, మజ్జిగ చిలికే కవ్వాన్నో 'గాజుల చేయి' ఎత్తుకున్నట్టు శబ్దం వినరాగానే తుర్రుమని బయటకు పారిపోయేది.

ఉపయోగించనూ, ఉపయోగించనూ పదునెక్కే ఆయుధమేదైనా వుంటే అది ఒక నాలుక మాత్రమే నన్నసామెత తాయారమ్మపట్ల నిజమైంది. అందువల్ల రానురానూ సీనయ్యకు తన జీవితం దుర్భర మనిపించింది. అలా అనిపించినప్పుడల్లా అతడు తన మనోదైన్యాన్ని పోగొట్టుకునేందుకు ఇల్లు విడిచిపెట్టి, కోవెలకు వెనుక వైపునవున్న రాగిచెట్టు క్రిందలి రచ్చవద్దకు వెళ్లి అక్కడ సమావేశమై సన్యాసులు, వేందాతులు, మరేం పనిలేని సోమరిపోతులూ నిరంతరమూ కొనసాగించే ఇష్టాగోష్ఠి సమావేశాల్లో పాల్గొనేవాడు. ఆ సమావేశాల్లో రాజకీయ సాంఘిక, ఆధ్యాత్మిక చర్చలెన్నో కలగాపులగంగా గంటల తరబడీ కొనసాగి, కడకు ఏ తీర్మానానికి రాకముందే అంతమయ్యేవి. పట్నాన్నుంచి దారితప్పి ఆవూళ్లోకి వచ్చిన నాగరికుడక్కడ దిగవిడిచిపోయిన పాత వార్తాపత్రికను కొంచెంగా చదువు తెలిసిన సీనయ్య చదివి వినిపించగా, ఆ వార్తలను గురించి అక్కడజరిగే వాదోపవాదాలు ఏ రాజ్యతంత్రజ్ఞులకైనా పాఠాలు నేర్పించ గలంతటి సునిశితంగా అలరారేవి!

కానీ ఆ రచ్చపైన కూడా సీనయ్యకు భద్రత లభ్యమయ్యేది కాదు. ఎప్పుడో ఒకప్పుడు తాయారమ్మ ఝుంఝూమారుతంలా అక్కడికి రావడమూ, ఒక్క సీనయ్యనేగాక అక్కడున్న వాళ్లనందరినీ ఆమె ఏకధాటిగా దుయ్యబట్టడమూ, తుపాకీవేటు వినగానే దిక్కులకు పారిపోయే కాకిమూకలా రచ్చపైన పెద్దలు చెల్లాచెదురుగా వెళ్లిపోవడమూ సర్వసామాన్యంగా జరుగుతుండేది. సీనయ్యవల్ల తమకందరికీ తలవంపులు కలుగుతున్నందువల్ల రచ్చపైని సభికులు అతడు దాపుకు రాగానే మోమాటం విడిచి అక్కడి నుంచీ వెళ్లిపొమ్మనేవారు. అలాటి పరిస్థితిలో నిరాశ్రయుడైన సీనయ్య పొలం పనినీ, భార్య పోరునూ తప్పించుకోడానికోసం తాతలనాటి పాత తుపాకిని చేతధరించి కొండల కావైపున వున్న అడవుల్లోకి వెళ్లిపోయేవాడు. అక్కడ ఏ సెలయేటి ఇసుక తిన్నపైన్నయినా కూచుని తన చెంతనే తోకాడిస్తూ పడుకున్న భైరవితో "ప్రియ భైరవీ! ఈ ప్రపంచంలో నాకన్నా నువ్వ, నీకన్నా నేను నిస్సహాయులం. మన కష్టాలెప్పుడు గట్టెక్కుతాయో" అని వాపోయేవాడు.

మామూలు ప్రకారం సీనయ్య ఒకానొకనాడు అడవిలో డొంకదారులవెంట తిరిగీ, తిరిగి అలసిపోయాడు. బారెడు దూరంలో కనిపించిన కుందేలొకటి అతడిని నాలుగైదు మైళ్లదూరం త్రిప్పించి, కడకు తుపాకీ వేటును తప్పించుకుని పారిపోయింది. అప్పటికి సూర్యుడు నడిమింట దుర్నిరీక్షంగా మండిపోతున్నాడు. తెల్లవారి చద్దన్నమైనా తినని కారణంచేత సీనయ్య ఆకలికి తాళజాలకపోయాడు. పైగా మితిమీరిన ఆయాసంవల్ల అతడు మరొక్క అడుగైనా ముందుకు వేసేందుకు శక్తిలేక కొండకొమ్ముపైన, ఒక బొంత జముడు చెట్టుక్రింద కూలబడ్డాడు.

అతడు పడుకున్న చోటునుంచీ కిందికి చూస్తే ఒక అగాధమైన లోయ కనబడుతుంది. ఆలోయలో సువర్ణముఖి వంపులుగా తిరుగుతూ ప్రవహిస్తుంది. నది కిరువైపులా మొగిలిపొదలు దట్టంగా వ్యాపించి వున్నాయ్. మొగిలి పూవుల కమ్మని వాసనలు అడవినంతా సుగంధ భరితంగా చేస్తున్నాయ్. ఆ దృశ్యాన్ని చూస్తూ సీనయ్య కొంతసేపటికి కళ్లుమూసుకుని కలత నిద్రపాలయ్యాడు.

సీనయ్య నిద్రనుండి లేచేనరికి సూర్యుడస్తమించాడు. అంధకారం మెల్లమెల్లగా దట్టమై పోతూవుంది. తను ఇల్లు జేరుకునే సరికి రాత్రి చాలాపొద్దు పోతుందనీ, ఇంత ఆలస్యంగా వచ్చినందుకు

పొరుగూరాయన: ఏమండీ! ఈవూరుకరణంగారిల్లెక్కడండీ?

ఆవూరాయన: ఏమోనయ్యా ఎక్కకపోతే నన్నేం చెయ్యమన్నావయ్యా? నేనెక్కమంటే మాత్రం ఎక్కుతాడా?

—పుల్లారావు, ఇంజరం.

# ★ చిరకాల నిద్రితుడు ★

తాయారమ్మ తననిక ఏంత మాత్రమూ క్షమించదనీ భయపడుతూ సీనయ్య మెల్లగా కొండ దిగడం ప్రారంభించాడు.

అతడు పర్వతాన్ని అవరోహిస్తుండగా ఎవరో "సీనయ్యా! ఆగవోయ్ సీనయ్యా!" అనడం వినిపించింది. అతడు చుట్టుప్రక్కల కలయజూచాడు. గూండ్లకు చేరబోతున్న పక్షులుతప్ప మరేమీ కనబడలేదు. ఒకవేళ తనమతి చలించిందేమో ననుకొని అతడు మళ్లీ నాలుగడుగులు ముందుకు వేశాడు. ఈసారి కేక మరీదగ్గరగా వినబడింది. "ఆగవోయ్ సీనయ్యా, ఆగు" అని. పదిబారల దూరంలో వున్న ఒక పొదవైపు చూస్తూ భైరవి మొరగడం 'సాగించింది' సీనయ్య ఆవైపుకి దృష్టిసారించి పొదమరుగునుంచీ తన వైపుకు వస్తున్న ఒక విచిత్రవ్యక్తిని చూచి వెరగుపడ్డాడు. ఏడడుగులకు తక్కువకాని ఒడ్డు పొడవు, అందుకు తగినలావు, చాకిరేవు బానంతటి తల, ఉన్నవా, లేవా అన్నట్లున్న చిన్నికండ్లు, వంపుతిరిగిన మీసాలు, పర్వత శిఖరంవలే పైకి కనబడుతున్న ముక్కు - ఈ ఆకారంతో ఆ పాదమస్తకం నల్లని దుస్తుల్లోవున్న ఆవింత మనిషి తలపైన ఒక పీపాను మోసుకుంటూ, చాచి చాచి అంగలువేస్తూ సీనయ్యతో "ఈ పీపానుకాస్త తీసుకోవయ్యా" అన్నాడు. సహాయ నిరాకరణమనే దుర్గుణం ఏకోశానాలేని వాడు కాబట్టి సీనయ్య ఆ పీపాను తీసుకొని, తన తలమీద వుంచుకుని ఆ గంతకుణ్ణి వెంబడించాడు.

అప్పటికి బాగా చీకటైపోయింది. అమావాస్యకు ముందు రోజు కాబట్టి ఆకాశాన నక్షత్రాలు మాత్రం మిన్కుమిన్కుమంటున్నాయ్. తూర్పు కొండపైన వున్న నీలమేఘమొకటి ఆకసమంతా అలముకోడానికి గట్టి ప్రయత్నమే చేస్తోంది. తలపైన పెద్ద బరువుండడంచేత సీనయ్యకు ముందుచూపు సరిగ్గా ఆనడంలేదు. సుమారు నాలుగైదు ఫర్లాంగులు నడిచిన, తర్వాత అతడు "మనమిప్పుడెక్కడికి పోవాలండీ?" అని సవినయంగా ప్రశ్నించాడు.

"అలాటి ప్రశ్నలడిగావంటే చెంపపళ్లు రాలిపోతాయ్ సీనయ్యా! మాట్లాడకుండా నన్ను వెంబడించు" అన్నాడా వింతమనిషి వెనుదిరిగి చూపుల్తోనే అతడిని భయపెడుతూ!

ఎటుచూచినా నిశ్శబ్దమే తాండవిస్తున్న ఆ అరణ్యంలో, తారకలైనా కనరాని ఆ కాళరాత్రిలో, ముండ్లతో గుండ్లతో నిండిన కాలిబాటలోబడి ముందా విచిత్రవ్యక్తి, తరువాత సీనయ్య, సీనయ్యను వెంబడిస్తూ భైరవి ఎంతదూరం వెళ్లివుందురో ఎవరు చెప్పగలరు! ఎప్పుడో ఒకప్పుడు ఆ వింతమనిషి "ఇక పీపాను దించు" అనడం విని సీనయ్య పీపాను కిందికిదించి తన చుట్టూ కలయ పరికించాడు. అప్పుడతడున్న చోటు కొండగుహ! ఆ గుహలో ఒక మూలగా గుడ్డి దీపమొకటి వెలుగుతోంది. ఆ దీపంచుట్టూ ఒక గుండ్రని అరుగుమీద ఆకారంలోనూ, వేషంలోనూ సీనయ్యకు పరిచితుడైన వింత మానిసిలాగే వున్న వ్యక్తులు ఏడెనిమిదిమంది జూదమాడుకుంటున్నారు. ఆ జూదమాడ్డం కూడా ఏదో కాలక్షేపానికి కన్నట్టుగాక ఒకడినొకడు మింగేయ దలచుకొన్నంత తీవ్రంగా వుండడం చూచి సీనయ్యకు ఆశ్చర్యమో, భయమో, విస్మయమో లేక ఆ మూడింటియొక్క సమ్మేళనమైన భావమో కలిగింది. సీనయ్య కనపడగానే వాళ్లు ఒక నిముసంపాటూ ఆటనిలిపి అతడినొక చీడపురుగును చూచినట్టు చూచి మళ్లీ జూదంలో నిమగ్నులై

పోయారు. సీనయ్య నక్కడికి తీసుకొచ్చిన వ్యక్తి ఒక చిన్న పాత్రను తెచ్చి అతడి చేతికిస్తూ పీపాలో వున్న మద్యాన్ని అక్కడున్న వాళ్లందరికీ పంచవలసిందిగా ఆదేశించాడు. సీనయ్య చిన్నపాత్ర నిండుతూ మద్యాన్ని నింపీ నింపీ ఇస్తుండగా వింత మనుషులందరూ పొట్టలు నిండేంతవరకూ తాగి 'ఏవ్' అని త్రేన్చి 'ఇక నువ్వూ తాగొచ్చు' అని సీనయ్యకు కంటితోనే సైగచేశారు. గర్భ కుహ

# ★ చిరకాల నిద్రితుడు ★

రంలో ఆకటి మంటలు ప్రజ్వరిల్లి పోతున్నందువల్ల సీనయ్య వాళ్ల మహౌదార్యానికి సంతసించి తనకు చాలనిపించేంత వరకూ పీపాలో వున్న ద్రవాన్ని గుటగుట తాగేశాడు.

తాగిన తరువాత సీనయ్యకు చాలా విచిత్రాలైన అనుభవాలు కలిగినాయ్. తనకు రెక్కలువచ్చి, ఆకశంలో ఎగిరిపోతున్నట్టు స్వర్గం సమీపించినట్టు, అక్కడ తన కెన్నో సత్కారాలు జరుగుతున్నట్టుఅతడు అనుకోసాగేడు. ఆతరువాత అతని మనసు ఆలోచించే శక్తి సయితం కోల్పోయింది. అతడు గాఢనిద్రలో మునిగిపోయాడు.

సీనయ్య మేల్కొనేసరికి రెండు బారల ప్రొద్దెక్కింది. పక్షుల కిలకిలా రావాలు ఇంకా తగ్గలేదు. చల్లని మారుతం హాయిగా వీస్తోంది. సీనయ్య కళ్లు నులుముకుంటూ "అరరే, రాత్రంతా ఇక్కడే గడిపేసేనే! నిన్నంతా ఏం చేశావని తాయారడిగితే ఏమని సమాధానం చెప్పుకోను?"




అనుకుంటూ లేచి నిలుచుకోబోయి కాళ్లురెండూ తిమురుపట్టి వుండడం వల్ల నడవలేక మళ్లీ కూలబడ్డాడు.

కాళ్లను అటూ, ఇటూ కదిలించి, ఒకదాంతో మరొకదాన్ని పెనవేసుకొని ఎలాగయితేనేం రెండు గడియలు శ్రమపడి వాటిని తన స్వాధీనంలోకి తెచ్చుకొని అతడు లేచి నిలబడి మెల్లగా నడవగల్గాడు. కానీ రాత్రి తానే దారిగుండా ఆ గుహాలోకి వచ్చాడో అతనికి తెలియలేదు. ఏవైపు జూచినా దట్టమయిన ముండ్లపొదలే కనపడ్డాయి. రాత్రి ఏ అరుగుమీాదనైతే జూదం జరిగిందో, ఆ అరుగుమీాద పైనెక్కడినుంచో ఒక జలపాతం దూకుతోంది!

సీనయ్య తన తుపాకికోసం వెదికాడు. తుపాకికి బదులు త్రుప్పుపట్టిన రెండు మూడు ఇనుపముక్కలు మాత్రం కన్పించాయి. భైరవిని ఎలుగెత్తి పిలిచాడు. అరుపులతో కొండలు ప్రతిధ్వనించాయిగానీ, భైరవి తిరిగి రాలేదు. తను సారాయిమత్తులో స్మృతిలేక పడివుండగా, ఆ విచిత్రపు మనుషులు తన తుపాకినీ, కుక్కనీ తస్కరించుకుని వెళ్లిపోయి వుంటారని సీనయ్య నిర్ధరించుకున్నాడు.

ముండ్లపొదల్లో ఎలాగో ఒకలాగు త్రోవ జేసుకుని అతడు లోయలోకి దిగేప్పటికి మధ్యాహ్నమైంది. సువర్ణముఖిలో కడుపునిండా నీళ్లయినా తాగుదామనుకున్నాడు సీనయ్య. కానీ ఆ నదిలో నీటితోవున్న ఒక్క చిన్ని చెలమైనా అతనికి కనపడలేదు. "నిన్న సాయంత్రం వరకూ నేనీ ఏటి దగ్గర్నే తిరిగానుకదా! అప్పుడు గట్లను తాకుతూ ప్రవహించిన నీరు ఒక్కరాత్రిలో ఎలా ఇంకిపోయిందో?" అని సీనయ్య ఆశ్చర్య పడ్డాడు.

అతడు ఊరి పొలిమేర చేరుకునేసరికి సాయంత్రం మూడుగంటలైంది. ఎందరెందరో అతని కెదురుగా వచ్చారు, అతడిని అబ్బురంతో చూచారు. వెళ్లిపోయారు. కానీ ఒక్కరు గూడా పలకరించలేదు. అతనికి ఒకవేళ తను సీనయ్య కాదేమోనని సందేహం కూడా కలిగింది. ఆ సందేహం తీరడానికని అతడొకసారి ముఖాన్ని తడివి చూచుకున్నాడు. ఆశ్చర్యం! అతడి చుబుకాలకు క్రింద ఒక మూరెడు పొడవుగడ్డం పెగిరివుంది!

మరొక్క ఆశ్చర్య మేమిటంటే ఎదురైన గ్రామస్థులు అతడిని గుర్తుపట్టలేక పోవడం అటుండగా అతడు సైతం వాళ్లని గుర్తించలేకపోయాడు. పరిచితమైన ముఖం మచ్చుకైనా కనపడలేదు. అందుకుతోడు గ్రామస్థుల వేషభాషల్లో కూడా పెద్దమార్పు గోచరించిందతనికి. "నిన్నటి వరకూ గోచీలతో తిరిగే పిల్లలు, తలవెంట్రుకల్ని జడగానైనా అల్లుకోవడానికి తెలియని ఆడవాళ్లు ఇప్పుడు నాజూకు దుస్తుల్లో బయస్కోపు బొమ్మల్లా తిరుగుతున్నారే! ఒక్క రాత్రిలోనే వీళ్లింతగా ఏలా మారిపోయారబ్బా" అనుకుంటూ

సీనయ్య విస్మయ చేతస్కుడై పోయాడు.

ఊరిలోపల ప్రవేశించిన తరువాత సీనయ్య ఆశ్చర్య సముద్రంలోనే మునిగి పోవలసి వచ్చింది. పూరి కొంపల స్థానంలో వీధి కిరువైపులా చిన్నచిన్న మిద్దె యిండ్లు సాక్షాత్కరించాయ్. ప్రతి ఇంటికీ ప్రాకారపు గోడలు, పూల తోటలు! కొన్ని ఇండ్లల్లోనుంచీ గంధర్వగానం కూడా వినవస్తోంది. "అబ్బే, ఇది మన పెంటపాడు కాదు. దారితప్పి నేనేదో పట్నానికి వచ్చేశాను" అనుకుని సీనయ్య తన నాశ్చర్యంతో చూస్తూ నిలబడి వున్న ఒక యువకుణ్ణి "పెంటపాడిక్కడికి ఎన్నిమైళ్లుంటుందండీ" అని అడిగాడు. ఆ యువకుడు పకపకనవ్వి "ఓరి నీ అమాయకత్వం బండ్ల కెక్కించనూ, ఇదే నయ్యా పెంటపాడు" అని అక్కడి నుంచీ వెళ్లిపోయాడు.

సీనయ్య మరికొంచెం ముందుకు వెళ్లాడు. శ్రీరామ చంద్రమూర్తి దేవాలయం యథాప్రకారంగా అక్కడేవుంది. దాని వెనుక రచ్చ, రాగి చెట్టు అలాగే వున్నాయ్. తూర్పుగా ఒకమైలు దూరంలో ఇనుప దారిమీద రైళ్లు వస్తూ, పోతూవుండడం స్పష్టంగా కనిపిస్తోంది. "ఇదే పెంటపాడు. ఇది పెంటపాడు కాక మరొకవూరు కావడానికి వీల్లేదు" అనుకున్నాడు సీనయ్య.

రచ్చ దగ్గరనుంచీ అతడు మళ్లీ వూళ్లోకివచ్చి తన ఇంటివైపు దారి తీశాడు. కొంత కష్టంమీద ఇంటిని గుర్తించగల్గాడు. కానీ ఆ ఇల్లు కూడా మునుపటిలా లేదు పైకప్పు గోడలు కూలిపోవడానికి సిద్ధంగా పూర్తిగా చదలపాలై పోయివుంది. వున్నాయ్ పైగా, ఆ ఇంట్లో

# ★ చిరకాల నిద్రితుడు ★

మానవులు నివసించే సూచనలైనా గోచరించలేదు సీనయ్యకు. అతడు పరుసగా పెద్దకొడుకునూ, చిన్నవాడినీ, భార్యనీ గొంతెత్తి పిలచాడు. అతని పిలుపులకు ప్రత్యుత్తరంగా రెండు గబ్బిలాలు మాత్రం ఈ మూలనుంచీ, ఆ మూలకు పరుగెత్తినాయ్.

సీనయ్యకు దిక్కులు తోచలేదు. బడిపంతులు రామప్పయ్యను గనక విచారిస్తే ఈ మార్పుకు కారణమేమిటో తెలియగలదని అతడు వీధిబడి దగ్గరికి వెళ్లాడు. అక్కడ కూడా తాటాకులపాకకు బదులు పెద్ద పెంకుటిల్లొకటి సీనయ్యకు ప్రత్యక్షమైంది. ఆ పెంకుటింటి గోడమీద "మహాత్మాగాంధీ విద్యాలయం" అని వ్రాయబడి వుంది.

విద్యాలయం ముందర నడివీధిలో **తండోపతండాలుగా మూగిన జనసమూహం ముందు** నిలబడి ఒక పెద్దమనిషి ఉపన్యసిస్తున్నాడు. ఆ ఉపన్యాసంలో "ఆంధ్రోద్యమం, విశాలాంధ్ర, ఆంధ్రరాష్ట్రం, పొట్టి శ్రీరాములు" మొదలైన మాటలెన్నో సీనయ్యకు వినిపించినాయ్. కానీ, ఉపన్యాస సారాంశం మట్టుకూ తెలియలేదు.

మాసిన గుడ్డలతో, పొడవైన గడంతో, అందరివైపూ శూన్యంగా చూస్తూ నిలబడివున్న సీనయ్యను చూడగానే జనులందరూ అక్కడ ఉపన్యాసం జరుగుతున్న విషయం మరిచిపోయి అతని చుట్టూ మూగారు. ప్రశ్నల వర్షం కురిపించారు. "నువ్వు జైల్లోనుంచీ పారిపోయి వచ్చావా?" అన్నారు. "నువ్వు చాలా కోపంగా వున్నట్టున్నావ్! నీ కాంధ్రోద్యమం పట్ల పూజ్యభావం లేదా?" అన్నారు. "అట్లా చూస్తే నువ్వాంధ్రుడివిగా తోచడంలేదు. ఆంధ్రుడివే ఐతే ఇలాటి శుభసమయంలో ఆనంద పరవశుడివై పోయి వుండవలసింది" అన్నారు.

ఎవరికి తోచినమాటలు వారు మాట్లాడిన తర్వాత సీనయ్య "మీ రేం మాట్లాడుతున్నారో నాకు అర్థం కావడంలేదు. నేను కూడా మీ అందరిలా తెలుగువాడినే. విశేషించి చెప్పాలంటే నేను రాజభక్తుణ్ణి కూడా" అన్నాడు.

"రాజేమిటీ, భక్తుడేమిటి? ఎవడయ్యా నీకు రాజు!" అన్నాడొకాయన.

"అయ్యయ్యో, ఆ మాత్రం కూడా తెలియనట్టు మాట్లాడుతారేమండీ! మనది హిందూ దేశం కదా! ఈ దేశాన్ని పరిపాలించే రాజు ఇంగ్లాండు దేశంలో వున్నాడు. నేనాయన్ను గురించే మాట్లాడుతున్నాను" అన్నాడు సీనయ్య.

"ఓరి నీ అవివేకం చట్టుబండలు కానూ! నువ్వు చెబుతున్నది ఏనాటిమాట! మనకు స్వరాజ్యం వచ్చి ఏడేండ్లయిందే" అని విస్తుపోయాడొకాయన.

"స్వరాజ్యమా! వచ్చేసిందా? నేను నమ్మను, నేను నమ్మను" అన్నాడు సీనయ్య.

"నువ్వు నమ్మినా, నమ్మకపోయినా మనకు స్వరాజ్యమేమో వచ్చింది. ఇప్పుడు ప్రజా ప్రభుత్వం మనల్ని పాలిస్తోంది. అంతేకాదు. మనం చిరకాలం నుంచీ కోరుకుంటున్న ఆంధ్రరాష్ట్రం కూడా ఈనెల ఒకటో తారీఖున అవతరించింది. అందుకే ఈ ఉత్సవం" అన్నాడొక వృద్ధుడు.

సీనయ్య తనకు మతిపోయిందేమోననుకున్నాడు. లేక ప్రపంచమంతా తనకెదురుతిరిగి, ఒక మాయానాటకాన్ని సృష్టించి, తన పాత్ర ఏదో తనకే తెలియని తనను అందులో చొప్పించి అపహాస్యం చేస్తున్నదేమోనని సందేహించాడు. కట్టకడకు ఇక ఈ ప్రశ్నోత్తరాలతో లాభంలేదనుకొని తన వృత్తాంతం యావత్తూ వాళ్లతో పూసగుచ్చినట్లు చెప్పేశాడు.

అంతా విన్నతర్వాత ఒక ముసలాయన "ఐతే నువ్వడివికి వెళ్ళింది నిన్న ఉదయమే నని నీకు బాగా జ్ఞాపకం వుందా?" అని ప్రశ్నించాడు.

"అయ్యో, లేకేమండీ! కావాలంటే నిన్నటి తేదీకూడా చెబుతాను ఎనిమిది, అక్టోబరు, వెయ్యిన్నీ తొమ్మిదివందల ముప్పయిమూడు" అన్నాడు సీనయ్య.

"ముప్పయిమూడో సంవత్సరమా! ఐతే ఇరవైఏండ్లయిందన్నమాట! ఈ ఇరవైఏండ్లు ఆ అడివిలో ఏంచేశావయ్యా" అన్నారు ఐదారు మందీ ఒకేసారిగా!

"అబ్బే, మరేం చేయలేదండీ. నిద్రపోయాను. ఐతే నేను నిద్రపోయింది మాత్రం ఒకేఒక రాత్రని నా ఉద్దేశం" అన్నాడు సీనయ్య.

తరువాత ఒక్క నిముసంపాటు అక్కడ చేరిన జనసమూహంలో మౌనం నెలకొన్నది. వాళ్లల్లో వాళ్లకెన్నో అనుమానాలు కలిగినాయ్. ఆఖరుకు ఒక గ్రామస్థుడు ముందుకు వచ్చి" పోనీ, నీ కీవూళ్లో తెలిసినవారెవరైనా వున్నారా?" అని అడిగాడు.

"లేకేమండీ! ఒకప్పుడు నా కీవూళ్ళో అందరూ తెలిసినవాళ్లుగానే వుండేవారు. నా కుటుంబం ఇక్కడే వుండేది. భార్యా బిడ్డలుండేవారు. వాళ్ళందరూ ఇప్పుడేమయ్యారో మరి! ఆ సందు వీధి చివరన, దేవాలయానికి ఎదురుగుండా పాడుపడిపోయిన పూరిల్లుంది చూచారా, అదే నా ఇల్లు" అన్నాడు సీనయ్య.

సీనయ్య తన ఇంటినిగురించి చెప్పి ముగించకమునుపే అక్కడున్నవాళ్లు పకాపక నవ్వి" మంచి వాడవేనయ్యా! అక్కడికొచ్చి, ఇక్కడికొచ్చి కడకు నీ కిక్కడొక ఇల్లుకూడా వున్నట్టు చెప్పేస్తున్నావ్! అందులోనూ మా గోపులుగాడి ఇల్లే దొరికిందా నీకు?" అన్నారు.

"మీ రే గోపులుగాణ్ణి గురించి చెబుతున్నారో నాకు తెలియదు. నాకుకూడా గోపులు అని ఒక కొడుకుండేవాడు" అన్నాడు సీనయ్య.

"గోపులా! అదిగో వాడా చెట్టు కింద. చూడు వాడే నేమో నీ కొడుకు" అని ఎవరో అన్నారు.

ఇంచుక సమీపంలో ఒక చెట్టు క్రింద పడుకుని ముప్ఫయి ఏండ్ల యువకుడొకడు బీడీ త్రాగుతున్నాడు. జనసమూహం నుంచీ కొందరు వెళ్లి అతడిని బలవంతంగా లేపి సీనయ్య దగ్గరికి తీసుకొచ్చి" మళ్ళీ మీ నాన్న బ్రతికి వచ్చేశాడురా బాబూ" అని హేళన చేశారు.

"మా నాన్నేమిటి, బ్రతికిరావడమేమిటి? ఆయన ఇరవైఏళ్ల క్రితం ఇల్లువిడిచి పరారైపోయాడు. నదిలో మునిగిపోయాడని కొందరూ, ఏదో రైలుప్రమాదంలో మరణించాడని కొందరూ చెప్పారు. మా నాన్న ఇల్లు విడిచిపెట్టి వెళ్లిన మరునాడే ఆయన పెంపుడుకుక్క తిరిగి వచ్చేసింది" అని గోపులు చెబుతుండగా సీనయ్య అడ్డువచ్చి "ఆ కుక్కపేరు భైరవే కదూ" అన్నాడు. గోపులు "అవును. దాని పేరు భైరవే. కానీ అదికూడా ఎప్పుడో చచ్చిపోయింది" అన్నాడు.

ఎన్నో ప్రశ్న లడగాలనుకున్నప్పటికీ అన్నిటినీ ఒకేసారి అడగలేక "పోనీ, మన రాముడెక్కడ?" అని ప్రశ్నించాడు సీనయ్య. ఈ ప్రశ్నకు గోపులు సమాధానం చెప్పలేదు. మరెవరో చెప్పారు. నలభైరెండు ఆగష్టు ఉద్యమంలో రైళ్లను నిలిపి, తంతికమ్ముల్ని తెగ్గొట్టి గొప్ప విప్లవ వీరుడుగా పేరెన్నిక గన్నాడట! స్వరాజ్యం వచ్చినతర్వాత కూడా వాడు ఊరూరా సేవాసమితుల్ని నెలకొలుపుతూ దేశంపైన తిరుగుతున్నాడట! పెంటపాడు గ్రామస్థులకు అతని పేరు అప్పుడప్పుడు పేపర్లలో మాత్రం కన్పిస్తుందట!

సీనయ్య మరొక్క ప్రశ్నను చాలా కంగారుగా అడిగాడు. "ఐతే గోపులూ, మీ అమ్మ ఏమైంది?"

గోపులు నిశ్చింతగా సమాధానం చెప్పాడు "ఆమె చనిపోయి రెండేళ్ళయింది"

సీనయ్య ఒక వేడినిట్టూర్పు విడిచాడు!

ఇంతలో ఆవూరికల్లా వృద్ధులైనవారైదారుగు రక్కడకివచ్చి, ఎన్నెన్నో పరీక్షలుచేసి కడకు "ఇతడే సీనయ్య" అని నిర్ధరించారు. ఆ ప్రాంతంలోని అరణ్యాల్లో కొన్ని భూతాలు కలకాలంగా నివసిస్తున్నాయనీ అవి త్రాగే మద్యాన్ని ఆస్వాదించే మానవుడు సంవత్సరాల తరబడీ గాఢనిద్రలో వుండిపోవడం సహజమే నని ఒక వృద్ధుడు ఎన్నో తార్కాణాలతో సహా వివరించి చెప్పాడు.

సీనయ్యయొక్క దీర్ఘనిద్రకు ఇదే కారణమని అందరికీ నమ్మకం కలిగేటట్టు ఎవరూ చెప్పలేకపోయినా, గయ్యాళి భార్యలతో కాపురం చేసే గృహస్థులు మాత్రం సీనయ్యకు దొరికిన భూతాలు సేవించే మద్యం తమకుకూడా దొరికితే ఎంతో బాగుండు ననుకున్నారు. ★

# అదీ - ఇదీ

—ఎన్నార్.

ఇటీవల వెలువడిన "అవ్వయ్యార్" చిత్రం ఆంధ్ర, తమిళ ప్రముఖుల ప్రశంసలు విశేషంగా చూరగొన్నది. సాహితీపరులు, పత్రికా సంపాదకులు, రాజకీయనాయకులు యావన్మందీ ముక్తకంఠంతో ఈ చిత్రం గొప్పదనం కీర్తించారు. భక్తి, నీతి, ధర్మం మొదలైన విలువలను ఈ చిత్రం అద్భుతంగా చూపిస్తోందని కొందరన్నారు. ఈ రోజుల్లో ఇటువంటి చిత్రం వెలువడడం అవసరమని మరి కొందరన్నారు. ఇంత పొగడ్తకు ఈ చిత్రం అర్హమా అని నామటుకు నాకు సందేహం కలుగుతోంది. ఈ చిత్రాన్ని నిష్పక్షపాతంగా, హేతువాద పూర్వకంగా పరిశీలించడంవలన కొన్ని ముఖ్య విషయాలు బయటపడతాయని ఆశిస్తున్నాను.

ఈ చిత్రాన్ని కీర్తించినవారిలో చాలమంది కళాప్రియులూ, కళావేత్తలూ ఉన్నారు. నాకు ఆశ్చర్యం కలిగించే విషయమేమిటంటే, ఈ పెద్దల్లో కొందరు కళ ప్రచారానికి సాధనం కావడం నిరసించేవారున్నారు. ముఖ్యంగా రష్యానుంచి వచ్చే సారస్వతాన్ని, చలనచిత్రాలను వీరు కేవలం ప్రచారంగా భావిస్తారు. ఇటువంటి "శుద్ధ కళావాదులు" "అవ్వయ్యార్" చిత్రాన్ని ఎలా సహించగలిగారా అని నా సందేహం. ఆ చిత్రంలో నాకు కనిపించిన తొంభైతొమ్మిదిపాళ్ళ ప్రచారం వారికి కనిపించలేదా అని నా ఆశ్చర్యం. బహుశా ఆ ప్రచారం తమ అభిప్రాయాల కనుగుణంగా ఉండడంవల్ల వారికి ఆ చిత్రం నూటికి నూరుపాళ్లు కళాత్మకంగా కనిపించి వుంటుంది.

మొదట అవ్వయ్యార్ పాత్రను పరిశీలిద్దాం. ఏదైనా సోవియెట్ చిత్రంలో స్టాలిన్‌ను దైవాంశ సంభూతుడుగాను, సర్వశక్తి సంపన్నుడుగాను చిత్రిస్తే మనకెంత చిరాకు కలుగుతుందో, అవ్వయ్యార్‌ను చూసినా అంత చిరాకు కలుగుతుంది. అవ్వయ్యార్ మానవ పాత్ర కానే కాదు. ఆమె జీవితం పూలబాటలాంటిది. ఆమె తలపెట్టిన కార్యానికి ఎట్టి అవరోధాలూ కలగలేదు. ఆమె మాటకు భూలోకంలో ఎదురులేదు. ఒకవేళ ఎవడైనా ఎదురు చెబితే ఏదో మహిమ చేసి చూపించి, వాణ్ణి లొంగదీసుకునేది. ఆమె అంతరంగం, మానసికజీవితం, ఎటువంటివో మనకి తెలియదు. ఆమె ఇచ్చిన ఉపన్యాసాలూ, పలికిన ధర్మసూత్రాలూ మాత్రమే మనకి తెలుసు. కాని మనిషి వ్యక్తిత్వాన్ని వెల్లడించేవి ఇవి కావు. మనిషి



రోహిణీవారి "ప్రతిజ్ఞ"లో కత్తియుద్ధం చేస్తున్న కాంతారావు, రాజనాల.



రోహిణీవారి "ప్రతిజ్ఞ"లో బాకుతో బెదిరిస్తున్న గుమ్మడి వెంకటేశ్వరరావు, సావిత్రి.

## ★ అదీ - ఇదీ ★

జీవితం ఒక్కటే మనిషిని ప్రతిబింబిస్తుంది.

అవ్వయ్యార్ ఆదర్శాలతో, ఆశయాలతో నాకేమీ తగాదా లేదు. ఆమె వాటిని సాధించడంకోసం ఏమి త్యాగం చేసింది? ఏమి అవరోధాలూ, అడ్డంకులూ ఎదుర్కొంది? అలా ఎదుర్కోవడంద్వారా ఆమె మనస్సు ఎటువంటిపరిణతి పొందింది? ఇవీ నాకు కావలసింది. ఎందుకంటే, ఆదర్శాలకూ, వాస్తవజీవితానికీ మధ్య నిరంతర సంఘర్షణ ఉన్నది. ఆదర్శాలకు వాస్తవ జీవితం ఒకపట్టాన లొంగేదికాదు. నిరంతర సంఘర్షణద్వారానే వాస్తవజీవితం ఆదర్శజీవితంకేసి క్రమక్రమంగా జరుగుతూ పోతుంది. మానవుడు ఆదర్శజగతిని ప్రతి అంగుళమూ జయించుకుంటూ పోవలసిందే గాని, ఏ సంఘర్షణా లేకుండా ఆదర్శాలు వాటంతట అవిగాని, ఒకమనిషి సంకల్పబలంవల్లగాని, లేక దైవశక్తివలనగాని భూలోకంలో ప్రతిష్ఠితాలు కావు.

అవ్వయ్యార్ వంటి ఆదర్శవాదులు మానవ చరిత్రలో ఎందరైనా కనిపిస్తారు. అయితే వారంతా వాస్తవ జీవితంతో కుస్తీపట్టినవారే. మన పురాణాలు తీసుకోండి. శ్రీరాముడు, హరిశ్చంద్రుడు అటువంటివారే. సత్య పరిపాలనంవారి ఆదర్శం. దానికోసం వారెన్నో త్యాగాలు చేశారు; రాజ్యాలు వదులుకున్నారు; భార్యలను వదులుకున్నారు; ఎన్నో కష్టాలనుభవించారు. వారి జీవితం పూలబాట కాదు; కంటకాకీర్ణమైన మార్గం. అందుచేతనే మనకి వారిమీద సానుభూతి, వారి ఆదర్శాలపై గౌరవం కలుగుతాయి. ఇదేవిధంగా ఎందరో మత ప్రవక్తలూ, సంఘ సంస్కారులూ, ప్రజానాయకులూ ఉన్నారు. వీరందరూ తమ ఆదర్శాలకోసం మానవ సహజమైన బాధలు పడ్డవారే. అందుకే వారిపై మనకు సానుభూతి కలుగుతుంది.

"అవ్వయ్యార్" చూస్తుంటే ఆమెపై మన కటువంటి సానుభూతి కలగదు. కోట్ల కొలది యోజనాల దూరంలో ఉన్న నక్షత్ర మండలంలాగ ఆమె మనకి అందరాని మనిషి. ఆమె గడిపిన ఉదాత్త నైతిక జీవితం మనకి సహస్ర జన్మలెత్తినా సాధ్యమయ్యేది కాదు. ఎందుచేతనంటే, ఆమె ఆ నైతికౌన్నత్యాన్ని స్వయంగా సాధించుకున్న మనిషి కాదు. ఆమెకు ఆ గొప్పదనం పుట్టుకతోనే వచ్చిందట. దేవుడే ఆమెను గొప్పదాన్ని చేసి భూలోకానికి పంపించాడట. ఒక్కమాటలో చెప్పాలంటే ఆమె మానవవ్యక్తి కాదు; దివ్య వ్యక్తి. మనమో, కేవల మానవులం. నైతిక జీవితం మనకి రెడీమేడ్‌గా దొరికే వస్తువుకాదు. జీవితపు ఎత్తుపల్లాలు ఎక్కిదిగి, తోటిమానవులతో, సంఘంతో సంఘర్షణపడి దాన్ని సంపాదించుకోవలసిందేగాని, ఏ దేవుడూ సహాయం రాడు. అవ్వయ్యార్ వంటి వ్యక్తులు వెయ్యిమంది మనకి ఉపన్యాసాలు ఇచ్చినా ప్రయోజనం లేదు. ఒక ఘట్టంలో నాకు నిజంగా నవ్వొచ్చింది. భూలోకంలో తను చేయవలసిన పని అయిపోయిందని చెప్పి అవ్వయ్యార్ కైలాసానికి నిశ్చింతగా బయలుదేరిపోతుంది. తన కర్తవ్యం తీరిందని ఆమె ఎలా తృప్తిపడగలిగిందో? ఇప్పటికి రెండువేల ఏళ్లు గడిచినా ఆమె ప్రారంభించిన "నైతిక పరివర్తనం" పని ఇంకా అలాగే మిగిలివుంది. ప్రవక్తలనబడేవారు ఆమెలాగ ఉప

న్యాసాలిస్తూ సంతృప్తి పడినంతకాలమూ ఆ పని అలాగే మిగిలివుంటుంది కూడాను.

అవ్వయ్యార్ కాక మిగతా పాత్రలను వివరంగా పరిశీలించవలసిన పనిలేదు. ఆ పాత్రల్లో ఎక్కడా వ్యక్తిత్వం కనబడదు. అన్నీ కీలుబొమ్మలే. రాజులు, సామంతులు, సామాన్యులు అంతా అవ్వయ్యార్ ఎలా ఆడిస్తే అలా ఆడతారు. "నేను చెప్పినట్టు నడవకపోతే చూసుకో" అన్నట్టు ఆమె తన మహిమాబలంతో మార్గం సుగమం చేసుకుంటూ పోతుంది.

ఇందాకనే చెప్పినట్లు అవ్వయ్యార్ తోను, ఆమె ధర్మసూత్రాలతోనూ నాకేమీ తగాదా లేదు. నిర్మాతలు ఆమెకు చేసిన రూపకల్పన ఎటువంటిది, ఆమెను మానవాతీత వ్యక్తిగా చేసి సాధించిన పరమార్థం ఏమిటి అని ప్రశ్నిస్తున్నాను. కళ ప్రచార సాధనం కాగూడదని వాదించే పెద్దలు ఈ చితంలోని మత ప్రచారాన్ని ఎలా భరించారూ అని నేను ప్రశ్నిస్తున్నాను.

ఇక తక్కిన విషయాల్లో కనిపించే లోపాలన్నీ చేర్చి జాబితా తయారుచేయడం వృథా పని. కొందరికి కనిపించినట్టు, రెండు వేల ఏళ్ళక్రిందటి తమిళ సంస్కృతి కూడా నాకేమీ కనిపించలేదు. ఎక్కువగా స్టూడియో వాతావరణమే కానవచ్చింది.

* * *

చివరికి ఈ చర్చ అంతా, కళకీ కేవల ప్రచారానికీ తేడా ఏమిటనే ప్రశ్నకి దారి తీస్తున్నది.

ప్రచారంలో భావం, సిద్ధాంతం ప్రధానమైనవి. ఒక సిద్ధాంతాన్ని బలపరిచేందుకుగాను అతిశయోక్తులు (*exaggeration*) అభూత కల్పనలు, సాధారణీకరణం (*generali sation*) మొదలైన రకరకాల పద్ధతులద్వారా, అవసరమైతే వాస్తవ జీవితపు సరిహద్దులనుకూడా అతిక్రమించి, ప్రచారం తనపని సాగిస్తుంది; జీవితాన్ని నిలబెట్టి, ప్రశ్నించి, పరీక్ష చేసేబదులు, భావాలవెంట, సిద్ధాంతాల వెంట పరుగులు తీస్తుంది. కళ అలా కాదు. దానికి జీవితమే ప్రధాన లక్ష్యం. జీవితాన్ని పరిశీలించి అందులో నుంచే సిద్ధాంతాలను బయటికి లాగుతుంది. ప్రచారం ముందే ఒక సిద్ధాంతం ఏర్పరచుకుని దాని కనుగుణంగా వుండే జీవితాన్ని కల్పన చేసుకుంటుంది. ఈ విషయాన్ని ఒక ఉదాహరణద్వారా పరిశీలిద్దాం.

మార్క్ ట్వేన్ నవలలన్నిటిలోకీ "హాకల్ బెరీఫిన్" ఉత్తమ నవల అని విమర్శకులంతా అంగీకరించారు. "మిస్టీరియస్ స్ట్రేంజర్" (విచిత్రవ్యక్తి) తక్కువ తరగతికి చెందినది. ఈ విషయంలో మనకి పేచీ అక్కర్లేదు. ఎందుకంటే మొదటి నవలను మార్క్ ట్వేన్ జీవితంతో బాగా పరిచయం ఉండే పడుచుతనపురోజుల్లో వ్రాశాడు. రెండో నవల జీవితంమీద విరక్తి పుట్టిన వార్ధక్యదశలో వ్రాశాడు. ఈ రెండో నవల కేవలం తన అభిప్రాయాలు, సిద్ధాంతాలు ప్రచారం చేయడంకోసమే వ్రాసినట్టు అనిపిస్తుంది. అందులో మానవజీవితంకంటె మానవజీవితం మీద మార్క్ ట్వేన్ అభిప్రాయాలే ఎక్కువ ప్రాధాన్యం వహిస్తాయి. ఈ అభిప్రాయాలన్నీ సైతాన్ ఉపన్యాసాలద్వారా మార్క్ ట్వేన్ వెల్లడిస్తాడు. ఆ నవలలోని పాత్రలు, సంఘటనలుకూడా రచయిత తన

(50-వ పేజీ చూడండి)




"పెంపుడు కొడుకు"లో జైలుకు తీసుకుపోబడుతున్న పుష్పవల్లి.

# ప్రశ్నలు..సమాధానాలు

కె. ఎ. ఆచారి—కాశీబుగ్గ.

"అవ్వయ్యార్" చిత్రం సమీక్ష వ్రాస్తూ, తన ఉపదేశాల వలన దుర్మార్గులైన మహారాజులను, పండితులను, పామరులను, సన్మార్గులుగా చేసింది." అని వ్రాశారు. అంటే "పండితులు" అనబడే వారంతా, దుర్మార్గుల లెక్కలోనివారే అని మీ అభిప్రాయమా?

—మీ రిలా అపోహపడడానికి కారణం తెలియడంలేదు. పండితు లనబడేవారంతా దుర్మార్గు లెందుకవుతారు? అవ్వయ్యార్ కాలంలో తమిళ దేశంలో తమిళ సంఘమని ఒక సంఘం ఉండేది. ఆ సంఘంలో సభ్యులు, ఎవరైనా ఒక కవి కావ్యం వ్రాస్తే దాన్ని పరిశీలించి యోగ్యతా యోగ్యతలు నిర్ణయించేవారు. ఆ సభ్యులు ఒకసారి ఒక కవిపై ద్వేషం వహించి అక్రమంగా అతని కావ్యాన్ని నిరాకరిస్తారు. వారికి అవ్వయ్యార్ తన మహిమ చూపించి సన్మార్గానికి తీసుకువస్తుంది. ఈ ఉదంతమే ఆ చిత్రంలో చూపబడింది. * *



"షేన్"లో మరొక దృశ్యం.



పారమౌంట్ వారి చిత్రం "షేన్"లో ఒక దృశ్యం.

ఎస్. రామచంద్రరావు—హాస్పేట.

సామాన్య ప్రజా జీవితాన్ని చూపించే చిత్రాలు తీయడానికి బదులు, నిర్మాతలు నమ్మటానికి వీలులేకున్నటువంటి జానపద చిత్రాలను ఇప్పటికి కూడ తీస్తున్నారు. ఈ *Sicentific* యుగంలో ఇటువంటి చిత్రాలుతీసి ప్రేక్షకులను మోసపుచ్చడానికి బదులు, ఇంగ్లీషు చిత్రాలను అనుసరించి చిత్రాలను ఎందుకు తీయరాదు?

—ఇంతకీ, సామాన్య ప్రజాజీవితం చూపించే చిత్రాలు తీయమంటారా, ఇంగ్లీషు చిత్రాలను అనుసరించి చిత్రాలు తీయమంటారా? ఇంగ్లీషు చిత్రాల్లోకూడా సామాన్య ప్రజాజీవితం చూపించే చిత్రాలు ఎక్కువలేవు.

"*Bycycle thief*" వంటి సామాన్యమనుజుని కష్టములను చిత్రముగా తీయగలవారు మనకు ఎవరైనా గలరా?

—బిమల్ రాయ్, దత్తా ధర్మాధికారి మొదలైనవారు ఈ విషయంలో కృషి చేస్తున్నారు. * * *

పుణ్యమూర్తుల కొండలరావు—పెనికేరు.

పేరులో ఆంధ్రత్వ ముట్టిపడుతూన్న బెనిగల్ రామారావు గారు ఆంధ్రులు కారా? వారి నివాసస్థలము యెద్ది?

—ఆయన కన్నడిగ; మైసూరు సంస్థానానికి చెందినవారు. కన్నడిగలకు తెలుగు వారికి పేర్లలో చాలా సామ్యం ఉంది.

"చండీరాణి" లో కిశోర్ చే "ప్రచండుని చంపించి తండ్రికి తర్పణము వదిలిస్తా"నని [illegible] చేయించి ఆపని కొసా "చండీ"చే చేయించడానికి కారణము యేమిటి మహాశయా?

—మాకుమాత్రం ఏమి తెలుసండీ?

* * *

గూటాల రామారావ్—ఏలూరు.

"చండీరాణి" (తెలుగు) చిత్రంలో ఆఖరున చంపా, కిశోర్‌లు డైలాగ్ పాడినట్లు చూపించకుండా, చండీ సమాధికి పుష్పాంజలి సమర్పిస్తున్నట్లు చూపించినట్లయితేయింకా బాగుండేదంటాను. మీరు కాదంటారా?

—కాదనము. కాని ఆ చిత్రం బాగుండడానికి చెయ్యవలసినవి ఇంకా చాలా వున్నాయనుకుంటాము.

* * *

హెచ్. శ్రీనివాసరావు—నెల్లూరు.

నేడు చలనచిత్ర రంగంలో ఏయే దేశాలు ముందంజ వేయుచున్నవి?

—ఇటలీ, జపాన్ దేశాలు. అంతర్జాతీయ రంగంలో ప్రస్తుతం ఈ రెండు దేశాల చిత్రాలకు పెద్ద గౌరవం ఇవ్వబడుతున్నది.



"దోబిఘా జమీన్"లో నిరూపరాయ్.



శ్రీ రాజరాజేశ్వరివారి "లక్ష్మి"లో తులసి దేవిని పూజిస్తున్న కృష్ణకుమారి.

## ★ అదీ - ఇదీ ★

(47-వ పేజీ తరువాయి)

సిద్ధాంతాల కనుగుణంగా కల్పన చేసినట్లే కనిపిస్తాయి కాని యథార్థంగా కనిపించవు.

"హకల్ బెరీఫిన్"లో మార్క్ ట్వేన్ సిద్ధాంతా లెక్కడా బాహాటంగా కనిపించవు. ఆ కాలపు అమెరికన్ జీవితానికి ప్రతిబింబమాత్రమే కనిపిస్తుంది. హకల్ బెరీ అనే తెల్లజాతి బాలుడూ, జిమ్ అనే నీగ్రో బానిసా, వీరితో అనుబంధం కలిగిన ఇంకా అనేకమందీ వుంటారు. ఈ పాత్రల పరస్పరసంబంధాలద్వారా, అప్పటి అమెరికాలోని నీగ్రో బానిసతనపు విధానం, ఆ విధానంలోని అమానుషత్వం, మానవు లేజాతికి చెందినవారైనా సమానులేననే భావం—ఇవన్నీ మార్క్ ట్వేన్ బహిర్గతం చేస్తాడు. అంటే ఈనవలలో జీవితచిత్రణం ప్రధానంగా జరిగేపనీ, సిద్ధాంతీకరణం దానిఫలితంగా, దాని కనుగుణంగా జరిగే పనీ అని తేలుతుంది.

మన పూర్వులు వ్రాసిన పురాణాలనీ, కావ్యాలనీ ఇదే దృష్టితో పరిశీలిస్తే, వాటిలో ఎంతవరకూ కళ ఉన్నదీ, ఎంత వరకూ ప్రచారం ఉన్నదీ బోధపడుతుంది. హరిశ్చంద్రుడు తన ఆదర్శంకోసం మానవ సహజమైన కష్టాలు పడుతున్నంతసేపూ అతని పాత్ర చిత్రణం జీవితపు సరిహద్దుల్లోనే వుంటుంది. ఆఖరున అతని ఆదర్శాన్ని బలవంతాన గెలిపించడం కోసం భగవంతుణ్ణి ప్రత్యక్షం చెయించేటప్పటికి రచయిత జీవితపు సరిహద్దులు దాటిపోవలసినవా డవుతాడు. 'సత్యం ఎలాగైనా జయించి తీరుతుంది' అనే సిద్ధాంతం మనస్సులో పెట్టుకుని రచయిత తదనుగుణంగా ఊహాసృష్టి చేశాడన్నమాట. అందుచేత ఆ చివరి భాగాన్ని కేవల ప్రచారంకింద జమ కట్టాలి.

ప్రచారం తప్పనీ, అనవసరమనీ నా అభిప్రాయం కాదు. ప్రచారం అవసరమే. అయితే ఆపని పత్రికలూ, కరపత్రాలూ, ఉపన్యాసవేదికలూ చేస్తాయి. కళాకారుడు సిద్ధాంతప్రచారంతో సంతృప్తిపడి వూరుకోడు. సిద్ధాంతానికి జన్మస్థానమైన యథార్థ జీవితపు అట్టడుగులదాకా స్పృశిస్తాడు. "చూడు; ఈ జీవితంలో ఎంత వైవిధ్యం ఉన్నదో! ఎన్ని సుఖాలు, దుఃఖాలు, ఎంత సౌందర్యం, ఎంతఅసహ్యంఉన్నాయో! ఈ జీవితం మారుతోంది. రా, నువ్వుకూడా ఈ మార్పులో పాల్గొందువుగాని, ఈ జీవిత నాటకంలో నువ్వుకూడా ఒకపాత్ర వవుదువుగాని; రా!" అని పాఠకుణ్ణి లేక ప్రేక్షకుణ్ణి ఆహ్వానిస్తాడు. ప్రచారంలో ఈ ఆహ్వానం ఉండదు. ప్రచారంలో నిర్జీవమైనసిద్ధాంతం మాత్రమే ఉంటుంది. జీవితంపొందే నిత్యపరిణామాన్ని అది చూపించలేదు.

ఈ తేడా అభ్యుదయవాదులం, వాస్తవిక వాదులం అనుకునే ఎందరు సాహితీపరులు, సినిమా కథకులు, దర్శకులు గుర్తించారు? అభ్యుదయ సిద్ధాంతాన్ని దేన్నో పట్టుకుని దాని ప్రకారం కథలు వ్రాసి, వాటినిండా నినాదాలు నింపి, వాస్తవికత సాధించాం అని తృప్తిపడితే అది వట్టి భ్రమ. వారికీ, "అవ్వయ్యార్" నిర్మాతల వంటి ఆదర్శవాదులకీ ఏమీ తేడా లేదన్న మాట. ★

## "పతిత"

అమియ చక్రవర్తి నిర్మించిన "పతిత" హిందీ చిత్రం గత శుక్రవారం మద్రాస్ ప్లాజా థియేటర్లో విడుదలయింది. దర్శకుడు అమియ చక్రవర్తి; సంగీత దర్శకులు శంకర్, జైకిషన్; దేవానంద్, ఉషాకిరణ్, లలితా పావర్, ఆగా ముఖ్యులుగా నటించారు. ఒక బీదకన్య ఒక ధనికుని చేత చెరచబడి శీలం పోగొట్టుకుంటుంది. ఆమె సంతాన వతికూడా అవుతుంది. ఆమె నదివరకే ప్రేమించిన ఒక ధనికయువకుడామె మానభంగం పొందివున్నదని తెలిసికూడా, ఉదారబుద్ధితో పెళ్లిచేసుకుంటాడు. కాని అతని తల్లికి ఈ రహస్యం తెలిసి కోడలును దుర్భాషలాడుతుంది. చివరకు కుమారుని బో, వలన ఆమె హృదయం పరివర్తన పొంది కోడలును స్వీకరిస్తుంది.

చూస్తున్నంతసేపూ ఎప్పుడైపోతుందా అనిపించేటట్లు, ఈ ఇతివృత్తం చిత్రించబడింది. ప్రారంభంనుంచే విసుగుపుట్టిస్తూ, కథ పోనుపోను మరీ అసందర్భంగా తయారై, అంతంలో ప్రేక్షకులను దిగ్భ్రాంతులను చేసి వదులుతుంది. దీనికి బాధ్యత పూర్తిగా దర్శకునిదే. "పతిత" అనే పేరు ఎందుకు పెట్టినట్లో దురూహ్యం. తనంతట తను పాపంచేసి నైతికపతనం పొందితేనే "పతిత" అనే పేరు సార్థకమవుతుంది. ఈ చిత్రంలో తనంతట తను ఏపాపమూ చెయ్యని యువతికి ఈ బిరుదు సరిపోదు.

"దాగ్" చిత్రంతో పేరు తెచ్చుకున్న అమియ చక్రవర్తి పురోగమించడానికి బదులు తిరోగమించినట్లనిపిస్తుంది. అసమర్థులైన నిర్మాతలు, దర్శకులు అసంఖ్యాకంగా వచ్చి సినిమా పరిశ్రమను భ్రష్టం చేస్తున్నారని ఈయన ఈమధ్య విమర్శించారు. బహుశా ఇది ఆత్మవిమర్శ అయివుంటుంది. ★

## అక్టోబరు 1

ఆంధ్రరాష్ట్ర అవతరణోత్సవం సందర్భంలో కర్నూలులో జరిగిన బ్రహ్మాండమైన సభ శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి ప్రార్థన గీతంతో ప్రారంభమైంది. తిరిగి ఆమె గానంచేసిన జాతీయ గీతంతో అంతమైంది.

ఆలిండియా రేడియోవారు ఈ సందర్భంలో చక్కని సంగీత కార్యక్రమాలు నడిపారు. ఉదయం పి. భానుమతి ఆంధ్ర రాష్ట్రాన్ని, ఆంధ్రోద్యమాన్ని కీర్తిస్తూ పాడిన పద్యాలు, పాటలు ప్రసారం చేయబడినవి. ఆరోజున సంగీత దర్శకుడు ఘంటసాల, కమలా చంద్రబాబు, బాలసరస్వతి కూడా గానం చేశారు. రాత్రి శ్రీ ఈమని శంకరశాస్త్రి, మరి అయిదుగురు వైణికుల

(53-వ పేజీ చూడండి)



విజయావారి "చంద్రహారం'లో ఎస్. వి. రంగారావు, ఎన్. టి. రామారావు.



ఆంధ్రరాష్ట్రం మొదటి గవర్నరు శ్రీ త్రివేది

# ఆంధ్రులకు పండిట్ నెహ్రూ ఆదేశం

(2-వ పేజీ తరువాయి)

తుంది. ఆంధ్రదేశాన్ని అభివృద్ధి చేస్తేనే భారతదేశం అభివృద్ధి అవుతుంది."

"శరీరములో ఒకభాగము అనారోగ్యకరముగా ఉంటే మిగిలిన శరీరము ఆరోగ్యముగా ఉండటము సంభవమా? కనుక భారతదేశాన్ని సేవించాలంటే ఆంధ్రదేశానికి సేవచెయ్యాలి."

"ఆంధ్రరాష్ట్ర విషయాలలో చాలా రోజులనుంచి తర్జన భర్జనలు జరిగినవి. అనేకసార్లు ఈ విషయం కలతలకు, పరస్పరదూషణలకు కారణమైంది. కాని అదంతా గతమైపోయింది. వెనకటి వైమనస్యాలను, కలతలను మరచిపోవాలి. ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పరచేందుకు శాశ్వతంగా ఉన్న మదరాసు రాష్ట్రాన్ని ముక్కలుగా చేయవలసి వచ్చింది. ఈ విధంగా విభేదము చేయుటము సంతోషకారణము అయినా అట్టి విధానం చెయకతప్పదు. గనుక అట్టి సమయంలో ఈ విచ్ఛేదము, ప్రేమతో, అదరాను రాగాలతో, చేయడము మంచిది. విభజన ఈ విధంగా జరిగితే మంచి వృద్ధిలోకి రావచ్చు. ఆంధ్రులు, తమిళులు ముందు సన్నిహితులై పరస్పర సహకారంతో పని చేసుకుంటారని ఆశిస్తున్నాను. అందరూ ఒకే భారత కుటుంబానికి చెందినవారు. మద్రాసులో ఆంధ్రులు చాలామంది ఉంటారు. వారంతా తమిళులతో కలసి మెలసి పనిచేయాలి. అన్ని రాష్ట్రాలు ఏ విధంగా అభివృద్ధికి ఎల్లా కృషిచేస్తున్నాయో మీరూ అల్లాగే నిర్మాణ కార్యక్రమాన్ని అమలు చేయాలి."

"గ్రామ ప్రజల దారిద్ర్యాన్ని నిర్మూలించాలి. గ్రామాలు బాగుపడాలి. ప్రజల జీవన ప్రమాణం హెచ్చాలి. ఏ రాష్ట్రం గాని ప్రజలందరి కృషివల్ల, కష్టపడి పని చేసినందువల్ల అభివృద్ధి పొందాలిగాని యింద్రజాలంవల్లగాని మంత్రాలవల్లగాని అభివృద్ధి పొందజాలదు. ఐక్యత, పరిశ్రమ, కార్యదక్షత ద్వారా అభివృద్ధి సాధ్యమవుతుంది. అందులో కొత్తగా రాష్ట్రం ఏర్పడుతోంది. మీకు మీరంతా అందరికన్న బాగా కష్టపడాల్సిఉంది."

## భూదానం శ్రమదానం

ముఖ్యంగా భూమి సంస్కరణలనుగూర్చి మీరు ఆలోచించాలి. ఈమధ్యన శ్రీ వినోబా భావే భూదానోద్యమాన్ని ప్రారంభించి చాలాభూమిని సంపాదించాడు. భూమిని సంపాదించి లేనివారికి ఇచ్చారు. వారే శ్రమదానోద్యమాన్నికూడా ప్రారంభించారు. మీరంతా ఈ శ్రమదానోద్యమంలో పాల్గొని, భూదానోద్యమానికి తోడ్పడి దేశాన్ని సౌభాగ్యవంతం చేసి ఆంధ్రాభ్యుదయానికి పాటుపడాలి."

'మన మీశుభసమయంలో మన స్వాతంత్ర్యోద్యమసారధి గాంధీమహాత్ముని స్మరించుకోవడం మన అందరివిధిని. రేపు గాంధీ జయంతి. గాంధీజీ ఏ ఆదర్శాలకోసమైతే కృషి చేశారో, ఆ ఉద్దేశ్యాలకోసం మనం కృషి చేయాలి. వారు చెప్పిన అహింసా మార్గాన రాష్ట్రాన్ని నడిపిస్తే, సంఘటితపరిస్తే, దేశం ముందుకు పోతుంది. వారు చెప్పినమార్గాన్ని అవలంబించినందువల్లనే స్వాతంత్ర్యాన్ని సంపాదించాం. వారు తమ దివ్యసందేశంద్వారా మనకు నాయకత్వంవహించి, దారి చూపించారు. వారు మనకు బోధించిన విషయాలలో ముఖ్యంగా అహింసాయుత పోరాటమనే విషయము మనము గుర్తు ఉంచుకోవాలి."

## ఉత్సాహ శక్తులు

"మనలో ఎంతో ఉత్సాహం, శక్తి, ఉంది. సరిగ్గా దాన్ని వినియోగించకపోతే అది కలహాలకు దారి తీస్తుంది. సరిగా ఉపయోగిస్తే బ్రహ్మాండమైన నిర్మాణశక్తి ఉద్భవిల్లి పనిచేస్తుంది. ఆంధ్ర రాజకీయ రంగం పెద్దలో అనేక విభేదాలవల్ల, కలహాలవల్ల దేశానికి తీరని నష్టం కలిగింది. ఇప్పటితో ఆంధ్రదేశ చరిత్రలో నూత్నాధ్యాయం ఆరంభమవుతోంది. అవన్నీ, మరచిపోయి అందరూ ఒకత్రాటిమీద ఇంతటినుంచైనా నడవగలరనిఆశిస్తున్నాను. ముఖ్యమంత్రి ప్రకాశంగారు ఆ ప్రకారంగా అందరిని నడిపించగలిగినవారు. వారు అల్లా చెయ్యగల్గాలంటే, మీరంతా మీమీ విభేదాలను వదలి, వారికి సంపూర్ణ సహకారాన్ని ఇవ్వాలి. ఆంధ్రులు తమ బాధ్య

# ★ ఆంధ్రరాష్ట్ర ప్రారంభోత్సవం ★

(1 వ పేజీ తరువాయి)

ఆంధ్రదేశం నలుమూలలనుండీ ప్రజలు వేలాదిగా వచ్చారు. పండిట్ నెహ్రూ అందరిచేతనూ, ముఖ్యంగా స్త్రీలచేత 'జైహింద్' అని ముమ్మారు నినాదం చేయించారు.

మద్రాసు రాష్ట్రంనుంచి ఆంధ్రులు విడివడిపోయినందుకు రాజాజీ విషాదం వెలిబుచ్చారు. భాషారాష్ట్రం అనే పేరు పండిట్ నెహ్రూకు శంకాభయకారణంగా ఉంది. కాని ఆంధ్రులు యావన్మందీ రాష్ట్ర ప్రారంభోత్సవంలో 1945 ఆగస్టు 15 స్వాతంత్ర్యోత్సవంనాటి ఆనందోత్సాహాలను తిరిగి చవిచూశారు. 'మనరాష్ట్రం, మన ప్రభుత్వం, మన పరిపాలన మనకు లభించాయి' అనే భావం ఆంధ్రు లందరికీ కలిగింది.

భాషా రాష్ట్రాలవల్ల భారతజాతీ యైక్య భావానికి ముప్పులేదని నిరూపించగలవారు కూడా తామేనని ఆంధ్రుల దృఢవిశ్వాసం. భాషారాష్ట్రాలుగా దేశపరిపాలన జరిగినప్పుడే సంపూర్ణ జాతీయవికాసానికి అవకాశం ఉంటుందని నిరూపించవలసినవారు ఆంధ్రులు.

ఆంధ్రరాష్ట్ర శాసనసభలో ఏఒక్క పార్టీకీ తగిన బలాధిక్యత లేకపోయినప్పటికీ సుస్థిరమైన పరిపాలనకు అనువుగా కొన్ని పార్టీలమధ్య ఒప్పందం సహకారం ఒనగూడాయి. ఆంధ్రదేశానికి అద్వితీయుడైన నాయకుడు ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా మంత్రివర్గం ఏర్పడింది.

ఈఉత్సాహం చల్లారిపోకముందే కర్నూలునే రాజధానిగా స్థిరపరచడానికిగాను సంజీవిరెడ్డిగారు కృషి చేస్తున్నారు. ఆంధ్ర రాష్ట్ర శాసనసభ మొదటి సమావేశంలోనే తాత్కాలిక రాజధానిని కర్నూలునుంచి మార్చడానికి కొందరు యత్నంచెయ్యగలరని సంజీవిరెడ్డిగారు, ప్రకాశం గార్లకు తెలుసును. అందువల్ల శాసనసభలో తమ నిర్ణయం మారకుండా ఉండాలంటే కాంగ్రెస్, ప్రజా సోషలిస్టుపార్టీ సభ్యులందరినీ, స్వతంత్రుల్నీ కూడ గట్టుకురావాలి. కర్నూలు నిర్ణయాన్ని ఆంధ్ర కాంగ్రెస్ ఆమోదించకపోతే అధ్యక్షపదవికి రాజీనామా ఇస్తానని సంజీవిరెడ్డిగారు ముందే ప్రకటించారు. సెప్టెంబరు 30 వ తేదీ రాత్రి, అనగా రాష్ట్ర ప్రారంభోత్సవంరేపనగా, కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంలో తీర్మానం ప్రవేశపెట్టించి ఆమోదముద్రపొందారు. అంటే ఆంధ్రరాష్ట్ర విభజన శాసన చర్చ సందర్భంలో మద్రాసు శాసనసభ కాంగ్రెస్ సభ్యులలో కర్నూలు నిర్ణయానికి వ్యతిరేకంగా వోటుచేసినవారు, వోటుచెయ్యడానికి నిరాకరించినవారు ఇకమీదట ప్రసక్తి వచ్చినప్పుడు కర్నూలుకు అనుకూలంగా వోటు చెయ్యాలని ఆంధ్ర కాంగ్రెస్ ఆదేశమిచ్చిందని అర్థం చేసుకోవాలి. ఈ నిర్ణయానికి కట్టుబడనివారి పైన ఆంధ్ర కాంగ్రెస్ కార్యవర్గం చర్య తీసుకోవచ్చును.

ఈ పరిస్థితులనూ ఆంధ్ర కాంగ్రెస్ తీర్మాన పాఠాన్నీ గమనిస్తే విశాలాంధ్ర ఏర్పడి రాజధాని హైదరాబాద్‌కు మారేవరకూ, ఆంధ్రరాష్ట్ర రాజధాని కర్నూలులో ఉండాలని ఆంధ్ర కాంగ్రెస్ నిర్ణయించిందని బోధపడుతుంది. ఈ నిర్ణయానికి ఎవరు ఎంతకాలం కట్టుబడి ఉంటారో, ముస్ముందు ఎన్నికలలో ఆంధ్ర ప్రజానీకం ఇట్టి నిర్ణయంపట్ల ఎట్టి వైఖరి చూపుతుందో చెప్పడం కష్టం. ప్రస్తుతానికి సుస్థిరమైన పరిపాలనతో ఆంధ్రరాష్ట్రం ప్రారంభమైనదని విశ్వాసంతో ఆంధ్రదేశ ఆర్థికాది సమస్యల పరిష్కారానికి నూతన దృష్టితో సమకట్టవచ్చును.

పండుగ గడిచింది. అయితే ఇంక,
"సామాన్య మానవుడి భుజస్కంధాలమీద
సమస్తభారం పడుతుంది.
అతనిదీ ఈరాష్ట్రం
అతనికోసం ఈరాష్ట్రం
పెత్తనం చెయ్యాలని ముందుకొచ్చే
పెద్దలిది గ్రహించాలని"
హెచ్చరించాడు శ్రీశ్రీ. ★

తను పూర్తిగా గుర్తించి సంచరిస్తారని నేను గట్టిగా విశ్వసిస్తున్నాను. ఆంధ్రదేశాన్ని అభివృద్ధిపరిస్తే భారతదేశాన్ని అభివృద్ధి పరచినట్లు. ఆవిధంగా మీరు చేస్తారని ఆశిస్తున్నాను. ★

## అక్టోబరు 1

(51-వ పేజీ తరువాయి)

సహాయంతో కూర్చిన "ఆదర్శ శిఖరారోహణం" అనే సంగీత చిత్రం ప్రసారం చేయబడింది. తరువాత ద్వారం వెంకటస్వామి నాయుడుగారి వయొలిన్ గానం ప్రసారం చేయబడింది. ★

# ★ సినిమా వార్తలు ★

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి "పెంపుడు కొడుకు" ముగింపు ఘట్టంలో పడింది. ఈ నెలాఖరుకు విడుదల చేయవచ్చునట. ఈ చిత్రం దర్శకుడు ప్రసాద్; సంగీత దర్శకుడు రాజేశ్వరరావు; నటీనటులు పుష్పవల్లి, కుమారి, సావిత్రి, సురభి బాలసరస్వతి, శ్రీరామమూర్తి, గణేశన్, ఎస్. వి. రంగారావు, ప్రసాద్ మున్నగువారు.

* * *

ఈ నెలలో మూడు నాలుగు చిత్రాల దాకా విడుదలయ్యే అవకాశం ఉన్నట్లు తెలుస్తోంది. రోహిణీవారి "ప్రతిజ్ఞ" దసరాకు విడుదల కావచ్చును. మద్రాస్ ఆర్ ప్రొడక్షన్సువారి "రోహిణి" శ్రీ రాజరాజేశ్వరీవారి "లక్ష్మి" కూడా విడుదల ఘట్టంలో ఉన్నాయి.

* * *

అశ్వరాజ్ ప్రొడక్షన్స్ వారు 'అన్నదాత' చిత్రానికి గడచిన నెల 27 వ తేదీని రెండు పాటలు రికార్డు చేశారు. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, అంజలీదేవి, రంగారావు మొదలైనవారు నటిస్తారు. హీరోయిక కొత్త తారని ఈచిత్రంలో ప్రవేశపెడుతున్నారు. ఇటీవల ఈ కొత్త తారనీ, చలాన్నీ బుక్ చేశారు.

ఈచిత్రానికి దర్శకత్వం వేదాంతంరాఘవయ్య, సంగీతం ఆదినారాయణ, నిర్వహిస్తారు. మాటలు పాటలు శ్రీ మల్లాది కృష్ణశర్మగారు వ్రాస్తారు. శర్మగారికి డా॥ గాలి బాలసుందరరావుగారు సహాయకులు.

ఈ చిత్రం వచ్చే మాసం సెట్సుమీదికి వెడుతుంది.

* * *

రోహిణీ పిక్చర్సువారు తమ తొమ్మిదో చిత్రానికి 'వద్దంటే డబ్బు' అని పేరు పెట్టారు. ★

# ★ కాలక్షేపం ★

(5-వ పేజి తరువాయి)

అది అంతా ఇంద్రియానందభోగమే గనుక ఇంద్రభోగం అనవచ్చు. కాని, అవిసంగా మితిగాని పరిమితిగాని ఎరుగకుండా "తలగవు కొండలకైనను" అన్నట్లుగా, అడ్డులేకుండా హద్దులేకుండా తిరిగిన ఏనుగకు తన హద్దులేవో తెలిసికొనలేని అజ్ఞానం ఏనుగంత ఉంటుంది. దానికి ఏనుగంత జ్ఞానం కలుగవలసి ఉంటుంది. అందువల్లనే మొసలితో ఏనుగు వేయిహాయనంబులు రేయింబవలు దీర్ఘ వ్యాధిపీడితునివలె పోరాడింది. "కరి మకరికి, మకరి కరికిని" పెను పెనగులాట జరిగింది.

ఎంత చెట్టుకు అంతగాలి అనేమాట నిజం. గజదొంగను పట్టుకోవాలంటే గజపోలీసు కావాలి అప్పుడుగాని, ఆ గజదొంగ గజగజలాడి నిజం బయటపెట్టడు తన మోసంలో తానే మోసపోయినానని అప్పుడు గ్రహిస్తాడు.

లోకాన్ని వంచనచేయడంలో ఎంత సమర్థుడైనా, ఆత్మవంచన చేసికొనడంలో ఆరితేరినవాడు లేడు తన పర్సులోని పైకము తానే అపహరించెడివాడు అవనిలో లేడు. ఆమాట నిజమే. కాని, తన పర్సులోని పైకమునకు తరుగులేదని తిరిగేవాడు తన పర్సును చూచి తానే మోసపోతున్నాడు. తన బలమునకు కొలతలేదని తలచెడివాడు తలచెడినవాడు.

"మీరజాల గలడా నయానతి
వ్రతవిధాన మహిమన్!"

అనే ఆలాపన ఆత్మవంచన యని తులతూచి చూపించినట్లుగా, తులాభారం నాటకంలో చాలాకాలం వినిపిస్తూ ఉండేది. నేను చాలా నిష్ఠపరురాలను; నేను వ్రతశతంబులాచరించిన పతివ్రతను అనే గర్వంతో గాని, ఎటువంటివానినైనప్పటికీ, నా రవ్వలకమ్మలతో, నా ఏడువారాల సొమ్ములతో కాని, వశపరచుకొనగలను అనే గర్వంతోగాని ప్రవర్తిస్తే ఆ వ్రత ప్రతాపంతో ఆత్మవంచన చేసికొనడం ఆసత్యభామకే అసాధ్యమైంది. ఇంతకూ భాగవతం అంతా భావగతం చేసికొన్నట్లయితే, ఆత్మవంచన చేసికొనుచు, తన శక్తికి మించిన పరాశక్తి యింకొకటి లేదని, వాదించేవానికి పరాభవం అవుతుందనిన్నీ, తన ప్రభావాన్ని తిరస్కరించెడి పరప్రభువు యింకొకడు లేడనే స్వభావంగలవానికి పరాభవం అవుతుందనిన్నీ, "తస్మాత్ జాగ్రత! జాగ్రత!" అని అకస్మాత్‌గా ఎప్పుడో ఒకసారి హెచ్చరించేవి కావు పురాణాలు. కాలాలు మారినా, దేశాలు మారినా, మనుష్యులు మారినా, స్థిరకాల ప్రమాణాలు పురాణాలు.

ఈ పురాణాలు అన్నీ బుట్టదాఖలు చేయవలసిన పిట్టకథలు కావు ఈ పురాణ గాథలు అగాధమైనవి నీతి అంటే ఏమిటి? దానిని నిస్సందేహంగా నిర్వచించడం నీ తరమా? "బొంకవచ్చు నఘము పొందదధిప" అనే నీతి కూడా ప్రఖ్యాతిగా ఉన్నదే. ఒక కొంపలో దాగిన ఆడవాళ్లను అన్యాయంగా చంపడానికి కొందరు దుర్మార్గులు వస్తే, యీ ఆడవాళ్ళను రక్షించడానికి ఆడవచ్చు అబద్ధం. దేశరక్షణకోసం శత్రుసైనికులను వంచించి వలపించి తమ సమ్మోహన మంత్రంతో వారి యుద్ధతంత్రములను గ్రహించి వచ్చుటకై దేశభక్తితో ప్రవర్తించిన పతివ్రతలు, అపవిత్రలు కారు - అటువంటి త్యాగి నీతిమాలిన నాతి కాదు - నీతి అంటే ఏమిట? ధర్మం అంటే ఏమిటి? సూటిగా ఒక్క మాటలో చెప్పడం సులభ సాధ్యం కాదు.

కాని, ఒక్క విషయం అందరూ అవశ్యం అంగీకరించాలి. అష్టాదశ పురాణాలన్నింటికంటె ఆత్మపురాణం అత్యంత ప్రశస్తమైనది. పొరుగింటిపోరు విన వేడుకయన్నట్లుగా యితరుల సంసారగోష్టి, సంసార తాపత్రయాలువగైరా వగైరా ఔరా! ఔరౌరా! అని నోరు తెరచుకొని ముక్కుమీద వేలు వేసికొని నోరు యికిలిస్తూ, నొసలు వెక్కిరిస్తూ వినడంలో మొనగాళ్లం మనం "అన్నా! శ్రీకృష్ణులవారిని ఒక అర్ధరాత్రివేళ సత్యభామగారు కాలితో దవడపళ్లు రాలేటట్లు తన్నిందిట! గొప్ప వారింట్లోనే గలభా లెక్కువ! పరాశరులవారు విరహాగ్ని కాగలేక పటపగలే పల్లెవాండ్ల పడుచుపిల్లను వలచి పిలిచి కలిసి రమించాడట! రామ! రామ! తావళులు త్రిప్పుతారు! తపస్సులు చేస్తారు! మనస్సును కట్టవేయలేరు! దుష్యంతుడు ఋష్యాశ్రమానికి వెళ్లి ఆయనా, ఆయనశిష్యులూ లేనిసమయంలో అక్కడ పెరిగిన చక్కని పిల్ల నొకదానిని కన్నుగీటి కడుపుచేసి వెళ్ళిపోయినాడుట. ఆమె కన్న కొడుకును ఎత్తుకొని ఎదుటకు వెళ్ళితే, తన్ని పంపిస్తాను తప్పుడుమాటలు మాట్లాడకు పో! పో! పోకిరీదానా! అన్నాడట! విశ్వామిత్రుడు విరాళిగొని యొకమరాళగామినితో మరుకేళి దేలి, ఆమెఅందమైన ఆడపిల్లను కని ఎత్తుకొని వస్తే, 'సంసారం లేని నాకు యీ సంతానం ఎందుకు ఓ మందుల మారి మాయలాడీ!' అని తన కళ్లు మూసికొని ఆ పిల్లవంక కూడా కన్నెత్తి చూడలేదట! ఎంగుకే దొంగమునీశ్వరులు! వీళ్లకంటె పెంట పాడు బైరాగులు నయం! సత్యహరిశ్చంద్రునిలో సత్యం ఉన్నదో లేదోఅని పరీక్ష చేసిన ప్రముఖు డీయన!" అని యీవిధంగా లోకంలో ఎంతమందికి ఎన్ని కంతులున్నాయో వింతగా ఎంచిచూచి, 'కథ కంచికి వెళ్ళింది కాస్క కడుక్కొని యింటికి వచ్చాం' అన్నట్లుగా కథ అంతా విని అక్షతలు నెత్తిమీద వేసికొనడం అంత కష్టమైన పనికాదు

కాని, యింత శ్రద్ధగా యితర పురాణాలు చదివి నమలి నెమరువేసి జీర్ణం చేసికొనగలశక్తి మనకు ఉన్నటువంటి పరిస్థితిలో, మన ఆత్మ పురాణమునే అంత శ్రద్ధగా విమర్శించుకొనడం ఎక్కువ మోక్షదాయకం. ఈఆత్మపురాణ శ్రవణ మనన ధ్యానము చేయగలిగినవాడే మహాత్ముడు మహాత్ముడు తన జీవితకథనే, ఆత్మకథనే అత్యంత శ్రద్ధాసక్తితో మథించి అందులోనుంచి అమృతం సాధించి ఆ చంద్రార్కం అమరజీవి యైనాడు. ఇతరుల కథలన్నీ తేటతెల్లంగా బాహాటంగా విమర్శించే వివేకి, తాను చేసిన అపచార వ్యభిచార అత్యాచార అనాచారములను బయటికి వెలడించగలడా? ఫలానా రోజున నేను చెల్లని సత్తు పావలా ఒకటి పరాకుగా ఉన్న గిరాకీసమయంలో కూరల దుకాణంలో ఫలానా వానికి చలామణీ చేశాననే విషయం రహస్యం లేకుండా చాటించే పెద్దమనిషి ఉన్నాడా? ఫలానా రోజున లెక్కల పరీక్ష జరుగుతున్న సమయంలో ప్రక్క విద్యార్థి చేసిన లెక్కను చూచి నేను కాపీకొట్టినానని కట్టెవిరిచినట్లుగా ఒట్టుపెట్టి చెప్పగలిగినవాడు నిజంగా ఆత్మపరీక్షలో పట్టభద్రుడైన దిట్టయని ఢంకామీద దెబ్బగొట్టి చెప్పవలసినదే.

ఆత్మ కథ వ్రాయడం అంటే తాను చేసిన మహాపచారాలు మూటుపెట్టి, మహాత్కార్యాల దండకం చదివి, సొంత డబ్బావాయించుకొనడం కాదు. ఆత్మ విమర్శ చేసికొనేవానికి ఆత్మవివేకం ఆత్మ జ్ఞానం కలిగి ఆత్మసాక్షాత్కారం అవుతుంది. తన అపచారాలన్నీ తానే వెల్లడించుకొనడం అంటే ఏమిటి? తన్ను తానే పబ్లికుగా అవమానించుకోవడం. తనకు తానే పరువు నష్టం చేసికొనడం. తాను సాని దానియింటికి ఒక స్నేహితునితో కలిసి వెళ్ళినానని మహాత్ముడు చాటించాడు. యిటువంటి పాడుపని చేసిన తన పాడు బుద్ధిని గాడిదకంటే హీనంగా ఆడిపోసి,

తన పరువును తానే బయటపెట్టుకొని అప్రతిష్ఠపాలై తన్ను తానే గాడిదమీద ఊరేగింపు కొన్నంత జీవప్రాయశ్చిత్తం చేసికొన్నాడు. అటువంటి వాడు "చారుశీల గుణ వర్జన మర్హము గా"దని గ్రహించి, తన"చారుశీల గుణ వర్జనమును" తానే గర్హించియున్నాడు. లోకమంతా మహామహు డనుకొని మంగళహారతులు తనకు యిస్తూఉన్న సమయంలో ఆ మహాత్ముడీ పని చేశాడు. అటువంటి మహోన్నతగౌరవ పర్వతశిఖరమునుంచి తన్ను తానే క్రిందకు పడద్రోసికొన్నాడు. "ఉరుతర పర్వతాగ్రమునుండి దృఢంబగు రాతిమీద గ్రుళ్లి కాయము పాతంబుగ జేయుట మేలు" అనే మాట అక్షరాలా జరుగవలసిన ఆత్మశిక్ష కాదు - ఆత్మహత్య కాదు. కాని, మహాత్ముడు తన ఆత్మకథలో గ్రంథస్థము చేసి అక్షరరూపంగా తన చారుశీల గుణ వర్జనమునకు తగిన ఘోర దండనలను తానే విధించుకొన్నాడు. ఆ విధంగా తన చరిత్రను తానే ఉన్న దున్నట్లుగా మూసలో పోసి అగ్నిపరీక్షలలో పెట్టి కరగించి, మురికిని వెలికి దీసి, తన బంగారమును పదార్వన్నె పసిండి చేసి సత్యతేజుడై ప్రకాశించాడు. అటువంటి మహాత్ముని పవిత్రనామమును లోకము సువర్ణ సువర్ణములతో లిఖించి పూజిస్తుంది. అంతేకాదు. అటువంటి పవిత్ర హిరణ్యతేజుడు, ఇత్తడిని బంగారం చేయగలడు. ఆయన మన్ను ముట్టితే పొన్ను అవుతుంది. కోతులచేత వారధి కట్టించగలడు. పచ్చి పఠానులను ప్రహ్లాదులుగా మార్చగలడు. ఆయన అంతర్వాణి ఆయనకు రాణి అవుతుంది. ఆయన ముట్టినది ముత్యం. ఆయన చేబట్టినది సత్యం. ఈ సత్యమే నిత్యం జయిస్తుంది కనుక "గాంధీ మహాత్మకీ జయ్" అని నోటినిండా అరచినప్పటికీ" "సత్యమేవ జయతే" అని చాటించినప్పటికీ, భాషభేదమే గాని భావభేదం లేదు. అటువంటి ఆత్మసత్యం తెలిసిన ఆత్మజ్ఞాని కావాలంటే—

"చారుశీల గుణవర్జన మర్హము కాదు జూడగన్"

★

# ★ నల్లమేక ★

(7-వ పేజీ తరువాయి)

"కసాశే...మళ్ళీ తొక్కేసినాడ్రా..డాబా మీద చూశావురా...ఆడదా మగదా ... వాడిలా ఒంగున్నాడండీ .. మేక ఇలా ఉరికిందండీ ..అవునండి మా గోడమీంచే గెంతిందండి...అదిగో అతను కూడా చెప్తున్నాడు...నీకేం పర్వాలేదయ్యా...రామ రామ...గుడ్ గాడ్...బాబ్బాబు నాపిల్లల సాక్షి...

అఫీసరుగారి ప్రాణం పోయిన నౌఖర్ని ఆస్పత్రికి తీసుకువెళ్లేరు. డ్రైవరు పోలీసు వారి చేతుల్లోకి వెళ్ళేడు.

తోటమాలీనీ, మోటారుకారునీ, చావుని తప్పించుకొన్న నల్లమేక ఎక్కడో బలుసాకు తింటోంది.

ఒక మేకని చావునుంచి తప్పించబోవడం ఒక మనిషి చావుకి కారణం అయిందని సాయంకాలం అయేసరికి ఊరంతా తెలిసింది. ఈరీతిగా ప్రమాదం జరిగిందని విన్నవారిలో కొంతమంది చనిపోయిన వాడికోసం విచారించేరు. కొంతమంది డ్రైవరుకోసం విచారించేరు. మేక బతికినందుకు మాత్రం ఎవ్వరూ సంతోషించలేదు.

ఈలోపున—

రోడ్డుమీద ఎవరైనా అక్కడ ఆగ భయం; ఏదైనా కొద్దిగా అయినా నల్లగా ఉంటే మేకరా భయం; తోటమాలీ "అదిగో అదిగో అదేనండి ఆ మేక" అని అందరికీ చూపిస్తూ వస్తున్నాడు తోట గేటుదగ్గర దారి కాసి నిల్చొని.

అత నలా కేక వెయ్యగానే అందరూ ఆగిపోతున్నారు.

మనిషి ప్రాణం తీసిన మేకని చూడ్డానికి ఎవ్వడాగడు?!

సాయంకాలం అయిదున్నర గంటలకి అదేరీతిగా,

"అదిగో బాబు! అదేనండి ఆ మేక" అని దార్న పోయేవారికి చూపించేడు ఒక మేకని తోటమాలి.

ఆ మాటకి, ముగ్గురు కూలిమనుష్యులూ, ఇద్దరు పెద్దమనుష్యులూ, నలుగురు చిన్నపిల్లలూ, తపీ మని ఆగిపోయి, అలానే నిల్చుండిపోయి, విస్తుపోయి చూసేరు.

ఇంతమంది ఆగినందువల్ల మేక కూడా ఆగిపోయింది.

మేకని చూడ్డానికి ఆగిన ఇద్దరు పెద్దమనుష్యుల్లోనూ ఒకడు "సెమీసూటు" వేసుకున్నాడు. ఎత్తుగా ఉన్నాడు.

కలెక్టరాఫీసు గుమాస్తా, తాలూకా కచేరి హెడ్ క్లార్కు, ఇన్షూరెన్సు ఆఫీసు అసిస్టెంటు, ఇంజనీరు మరియు కంట్రాక్టరు, పేరుపడ్డ వకీలు, డబ్బు గణించిన బారిస్టరు, రయ్‌జింగ్ అడ్వకేట్, షికారువెళ్లే సబుజడ్జి, నడవడమే కసరత్తుగా పెట్టుకున్న ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేటు, ఇప్పటికి ఇద్దరే రోగుల్ని చంపిన డాక్టరు, ఆపరేషన్ చేసే ఛాన్సుకోసం ఆర్నెల్లనుంచీ కాసుకూర్చున్న హౌస్ సర్జన్, పాఠాలు చెప్పగలిగిన టీచరు, పాఠాలు చెప్ప నిష్టం లేని ప్రొఫెసరు, రిసెర్చి స్కాలరు, అమెరికా వెళ్ళదల్చుకున్నవాడు, రష్యాగురించి బాగా తెలిసినవాడు, ఇంగ్లీషులో రామాయణం చదివినవాడు, టైమ్ ఉంటే వేదాలు అంతు కనుక్కోగలిగినవాడు, హూణభాషలో అనర్గళంగా మాట్లాడగలిగినవాడు, సంఘటనకోసం ఎదురుచూసే షార్ట్ స్టోరీ

## పాప

"రవి"

ప్రొద్దు ప్రొద్దుటలేపి
మొగము కడిగించి
తలదువ్వి బొట్టెట్టి
చలిది తినిపించి
చక్కగా లాగూను
చొక్కాను తొడిగి
పలక, బలపము యిచ్చి
బడికి పొమ్మంటె
అమ్మ నేనా బడికి
అరుగనన్నాడు
మూడు రెండ్లారని
మొన్న జెప్పారు.
రెండు మూళ్లారని
రెట్టించె నిన్న.
మేష్టారికసలేమి
చదువు రాదమ్మ.
అందుచే ఆ బడికి
నే నరుగనమ్మ

## నల్లమేక

రైటరు, మవుంట్ ఎవరెస్టు ఎవరెక్కారో నిద్రలో కూడా చెప్పగలిగినవాడు, అరే అరే అసెంబ్లీ మెంబరు, అబ్బో అబ్బో పార్లమెంటు సభ్యుడు, పాశ్చాత్య సినీతారని తప్పించి మిగోకర్ని పెళ్లాడనని పట్టుపట్టినవాడు, పోలీస్ "డి క్రీ నూ పర్నింట్సు" సెలక్షన్‌కి వెళ్తూన్నవాడు, ఐ. ఏ. ఎస్ పరీక్షలో తప్పబోతూన్నవాడు.

ఎవరైనా కావచ్చు అతను.

అంటే అతగాడు నేలని విడిచినవాడు. సాము చేయడం రానివాడు. ఎక్కువగా చదువుకొన్నవాడు. ఉన్న మతి పోయినవాడు.

ఆ పెద్దమనిషి తనతో వస్తోన్న రెండవ పెద్దమనిషితో :

"మనిషి చచ్చినందుకు విచారిస్తున్నారే! గాని ఈ మేక బతికినందుకు ఒక్క వెధవైనా సంతోషించేడా?!"

అని చెప్పి తన చమత్కారానికి తెగ సంతోషించి, మేలురకం నవ్వుల్లో మొదటి రకం నవ్వు నవ్వేడు.

అందుకు ఆ రెండవ పెద్దమనిషి :

"అయ్యో! తమకి మేకయెడల ఉండే సానుభూతి మనిషియెడల ఏల లేదు?" అని ప్రశ్నించి, చీవాట్లు పెట్టి, చెప్పుతో కొట్టక, మీదుమిక్కిలి "ఐసే, వ్వై నార్ యూ నాట్ వి టీ! మాంచి గమ్మత్తుగా చెప్పేవు స్మా! నాకా విషయం తట్టనే లేదు" అని ఎంతో మెచ్చుకొని మేలురకం నవ్వుల్లో రెండవరకం నవ్వు నవ్వేడు.

తోటమాలీ చూపెట్టిన మేక గర్భం ఉన్నట్టి నల్లటి ఆడమేక. వాళ్ళంతా తన వైపు అలా అమర్యాదాగా చూడ్డమే కాకుండా, వెకిలిగా నవ్వడంతో ఆ ఆడమేకకి చాలా కోపం వచ్చి, "ఛీ ఛీ! ఈ మనిషి వెధవలకి బుద్ధీ జ్ఞానం లేనే లేదు. చివరకి, మర్యాదా, మప్పితం కూడా మర్చిపోతున్నారే ఈ వెధవలు ఛీ ఛీ" అని ఈసడించి తిట్టుకొని, "వీళ్ళకి సిగ్గూ లజ్జా లేకపోతే నాకయినా ఉండొద్దా" అన్నట్టుగా తన తోకని బాగా కిందికి దించుకొని, సాధ్యమైనంతమట్టుకు పొదుగు చాటు చేసుకొని, ఆపరిస్థితుల్లో వీలయినంత గాంభీర్యం తెచ్చుకొని వడిగా నడిచి వెళిపోయింది వాళ్ళకి దూరంగా దూరంగా. ★

## ముచ్చటగా ముగ్గురు

(33-వ పేజీ తరువాయి)

పడ్డాం కాని - మా అదృష్టవశాత్తు అక్కడ గట్టుమీద తిరుగుతున్న మనుష్యుల్లో కొందరు శవం తాలూకు తదనంతర క్రియలబాధ్యత తమపైన వేసుకొన్నారు.

ఆమె జీవితగాథనుగూర్చిన దిగువ విశేషాలు మాకు తరువాత తరువాత తెలిశాయి. ఆకథలో కొత్తదనం ఏమీ లేదనుకోండి. ఇలాంటి కథలు అన్నింటిలోలాగే యీవిడకూడా ఎవరినో నమ్మి మోసపోయింది. ఆమె తెలిసో, తెలియక చేసిన ఆ ఒక్క తప్పిదానికి అయినవారూ కానివారూ ఆమెను అతిహీనంగా చూసి బ్రతకటానికి చోటు లేకుండా చేశారు.

దయమాలిన సంఘంతో ఒంటరిగా పోరాడలేని యీ అశక్తురాలు నానాటికి జీవితంలో అధఃపతితురాలైంది. కొంతకాలం పాటు రోజుకి పన్నెండు గంటలు చొప్పున ఎక్కడో పనిచేసి, వారానికి పన్నెండు షిల్లింగులు సంపాదించి, అందులో ఆరు షిల్లింగులతో కడుపున పుట్టిన బిడ్డను పోషించి మిగిలిన ఆరు షిల్లింగులతోనే జీవయాత్ర కొనసాగించాలని చూసింది. ఈరోజుల్లో జీవయాత్ర సాగటానికి వారానికి ఆరుషిల్లింగులు ఏం చాలుతాయి?

చివరికెప్పుడో ఒక రోజున ఆమెకి జీవితంమీద చిరాకు వేసివుంటుంది. అంధకార బంధురమైన భావి జీవితం ఆమె ఎదుటనిలిచి వికటాట్టహాసం చేసివుంటుంది. కడసారి ప్రయత్నంగా ఆమె ఎరిగివున్న ప్రతి ఒక్కరినీ తనను బ్రతికించమని అర్థించివుంటుంది. కులటల జాతిలో చేర్చబడిన ఈ అభాగ్యురాలిని ఎవరూ కనికరించలేకపోయారు. ఆమెకే ప్రాణం విసిగి, కన్నబిడ్డను కడసారి కౌగలించుకొని, కన్నీటితో జలక మాడించింది. చివరికి మిగిలిన ఏ అణా కానో పెట్టి ఒక చాకొలెట్ పొట్లం కొని ఆబిడ్డ చేతులో పెట్టి, తాను 'గోరింగ్' గ్రామం చేరివుంటుంది.

ఆవిడ జీవితాంతంవరకు మోసుకు తిరిగిన స్మృతులకి రంగస్థలం ఈ 'గోరింగ్' గ్రామం కాబోలు. నాటి పగటి సమయమంతా ఆమె విషాదభారంతో క్రుంగిపోయిన మనస్సుతో నదీతీరాన్నే తిరిగివుంటుంది. లోగడ ఆవిడ అవ్యక్తంగా ఏ మోదఖేదాలనైతే అనుభవించిందో, ఆ ఘట్టాలన్నిటిలోనూ మూగసాక్షిగా మెలగిన ఈ నదీమతల్లికి, ఆమె, ఆ మునిమాపువేళ, చేతులెత్తి నమస్కరించి వుంటుంది. బాధలతో బరువెక్కిన తనతలను నదీమతల్లి గుండెలపై ఆనించి వుంటుంది. ఆతల్లి తన చల్లని చేతులను చాచి, వ్యథితహృదయయైన ఈ అమాయికురాలిని తనలోనికి ఆహ్వానించి ఈజీవి అనుభవిస్తున్న ఆవేదనలన్నిటికీ ఒక్కసారిగా భరతవాక్యం పలికి వుంటుంది.

ఆ అమాయకురాలు బ్రతుకులోనూ పాపం చేసింది: చావటంలోనూ పాపమే చేసింది. ఈ విధంగా పాపంచేసిన వారు యింకా ఎవరైనావుంటే వారందరిని క్షమించమని కరుణామయుడైన ఆ భగవంతుని పరిపూర్ణ విశ్వాసంతో ప్రార్థిస్తున్నాను.

(ఇంకా వుంది.)

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madr